శ్రీ

# సరోజముఖి.

( ఆరంకముల నాటకము )

ఇది

బిట్రా ఆంజనేయులుచే
రచింపబడి

( శ్రీ కెరా వెంకట్రామయ్యచే
ప్రకటింపబడియె.

నాదెండ్ల గుంటూరు జిల్లా. )

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు 1 పేజి మొదలు
24 పేజీలవరకు ముద్రింపబడినవి.

మొదటి కూర్పు 1000.

1927.

కాపీరైటు రిజిష్టరు ] [ వెల రు 1-0-0

M. I. P. PROJECT
Microfilmed.

# ఇందు వచ్చు పాత్రములు.

—♦ పురుషులు. ♦—

1 విక్రమార్కుడు
2 ప్రభాకరుడు
3 రజనీచరుడు
4 కాశ్యపుడు
5 చంద్రకేతుడు
6 భానుమంతుడు
7 రామావధానులు
8 అప్పంభొట్లు

☞ ఇంకను భటులు మున్నగువారు సమయానుకూలముగా వత్తురు.

—♦ స్త్రీలు ♦—

1 సరోజముఖి
2 రాజముఖి
3 కళావతి
4 రాగవల్లరి
5 భ్రమరిక
6 యోగిని

శ్రీరస్తు.

# విజ్ఞప్తి.

---

పాఠకమహాశయులారా !

ప్రథమమున నస్మత్కవితాలతాలవాలంబును సరసపద్య రచనాకౌశలుండును ప్రియమిత్రుండును నగు మ॥ రా॥ శ్రీ॥ దొంతరాజు వెంకటరామయ్యగారితోఁ గవితాప్రసంగంబునంగలసి యొక్కనాఁడు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహకవిగారి "మణిమంజరి" నవలను జదువుచు పతివ్రతామాహాత్మ్యకలితంబగు దానిని బ్రదర్శనార్హంబుగా జేసిన యోగ్యంబుగా నుండునని యోచించి యిరువుర మీసరోజముఖియను పేర నాటకమును వ్రాయ ప్రారంభించితిమి. తదుపరి కొన్ని కారణాంతరములచే గొంతకాలమువరకు నాగి మగల నామిత్రుని సాయమున నెట్టెట్టో ముగించితిని.

నాటకరచనకు శేషము ముద్రణమునకుగూడ పెక్కునెల లాలస్యమయ్యె నెట్టకేలకు నాకు మిత్రుండును వైశ్యకులరత్నంబును నగు శ్రీయుత మోటమఱ్ఱి రాఘవయ్యగారి ధనసహాయము చేతను మరికొందరి మిత్రుల ప్రోత్సాహముచేతను ముద్రింపించితి. ఇయ్యది ప్రథమప్రయత్నమగుటను ననేకదోషంబు లుండకమానవు కావున తప్పులనన్నింటి నొప్పులుగ భావించెదరని మిక్కిలి ప్రార్థించెద.

తాడికొండ,
2-5-27.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
బిట్రా ఆంజనేయులు.



# అంకితము.

## ఇష్టదేవతాప్రార్థనము.

శా॥ శ్రీ సీతాకృతి మాయతో మెలగుచున్ ♦ జిద్రూపుఁడై తామస
వ్యాసంగంబునఁ దమ్ము దామరచు న ♦ ష్టారాతిసందోహముల్
గాసిం జెందగ జెండి సత్వయుతులన్ ♦ గాపాడుచున్ లోకసం
త్రాసంబుల్ బెడబాపు రాఘవపర ♦ బ్రహ్మంబు ధ్యానించెదన్.

## గురుస్తుతి.

గీ॥ అక్షరాభ్యాసమాది గా ♦ వ్యముల దనుక
గరపి విద్యావిశారదు ♦ గాగ జేసి
దయను గను తాడికొండకే ♦ దారలింగ
సుకవిసింహుని గొల్చెద ♦ సుకృతమతిని॥

ఉ॥ పద్యములైన వాక్యముల ♦ బల్మరు నేర్పుచుఁ గావ్యసంతతి
న్గద్యముగాగ జేసి సుతు ♦ కంటను నెక్కుడు ప్రేమజూచు ని
త్యాధ్యయనున్ గురున్ హరితసాన్వయు మల్లమపల్లి బుచ్చయా
రాధ్యుని గొల్చెదన్ సుగుణ ♦ రాశిని నీశ్వరలోకవాసునిన్॥

## కృతినిర్మాణప్రస్తావన.

గీ॥ బాల్యమాదిగ బ్రీతి స ♦ త్పాత్రునిగను
జేసి మన్నించు జనకుని ♦ సేవజేసి
ఋణవిముక్తుండ గాకుంట ♦ నీసుకవిత
నర్పణము జేయుచున్నాఁడ ♦ నతులభక్తి.

కం॥ నను నిరతము గారాముమ
గను సాఁకి మదీయదృశ్య ♦ కావ్యంబునకున్
దనరగ కృతిపతి యగునా
యనుగున్ జనకుని చరిత్ర ♦ మభివర్ణింతున్॥

కృ తి ప తి వం శా వ తా ర ము.

కం॥ చండీనాథుని కృపచే
చండాంశుని సుతుని గెలిచి ♦ చయ్యన చిరజీ
వుండై నుతికెక్కిన మా
ర్కండేయమహర్షి వెలయు ♦ ఘనచరితుండై॥

గీ॥ అతని గోత్రంబు నందు బి ♦ ట్రాన్వయమున
కలశవారాశియందు రా ♦ కాశశాంకు
సరణి నుద్భవమయ్యె పి ♦ చ్చయ ఘనుండు
వితరణాశేషవిభవ ని ♦ ర్జితఘనుండు॥

సీ॥ అర్థికోటికికల్ప ♦ కావనిజంబన
వితరణ శీలంబు ♦ వెతుకనేల
జీర్ణాలయములకు ♦ జీవదాతయనంగ
దైవభక్తిని వేరె ♦ దలపనేల
అరివర్గములపాలి ♦ కంతకుఁడని చెప్ప
నడవడికల వేర ♦ యడుగనేల
శాంత్యాదికములకు ♦ సదనంబయని పల్క
గుణవితానంబుల ♦ గణనమేల

గీ॥ చటుల దుర్భరసంసార ♦ జన్యఖేద
మెరుగఁడన సంపదల పాలి ♦ కరుగనేల

ననగ జెలువొందె నతఁడు తా ♦ శాద్రియందు
నధివసించుచు శ్రీపిచ్చ ♦ యాహ్వాయమున॥

కం॥ ఏకోదరసంజాతల
లోకనుతపతివ్రతాత్వ ♦ లూనేందిరలన్
శ్రీకనకాంబాభిఖ్యల
జేకొనె పత్నులుగ నతఁడు ♦ చేకోప్రీతిన్॥

ఉ॥ అందుఁ గనిష్ఠకున్ సుతుఁడ ♦ నై జనియించియు నగ్రమాత యు
స్పందితదీక్ష విద్యలకు ♦ సాయమొనర్చి కృతార్థు జేయ బెం
పొంది సమత్వభావమున ♦ నొప్పుచు సంతతమున్ సపర్యచే
తం దనియించుచుంటినిటు ♦ దల్లుల కిద్దర కేకపుత్రతన్॥

కం॥ ఇంతటి సంసారమునన్
కాంతల నను గూడి యుండి ♦ కంజాతాక్షున్
జింతింప చెపుడు జీవిత
మాతయు చరితార్థ మొందు ♦ నట్టులు గడపెన్

మ॥ అకలంకస్థితి నొక్కనాఁడు సిజగే ♦ హంబందునన్ బుత్రమి
త్రకళత్రంబులు చెంగట న్మెలగి ను ♦ ద్యద్భక్తి చిత్తంబు నం
దక గోపాలుని జేర్చి భాగవతము ♦ న్నాచేత వించున్ సుఖా
త్మకమౌ ముక్తిపదంబు చూరగొనె న♦మ్మాన్యుం డనాయాసతన్

కం॥ ఏతాదృశ గుణఖనికిని
సీతాధిప పాదపద్మ ♦ చింతితమతికిన్
భూతదయాపరిరంభున
కాతత సత్కీర్తి పూరి ♦ తాశాంతునకున్॥

సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సరోజముఖి యను దృశ్యప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన.



శ్రీరస్తు.

# సరోజముఖి

## ప్రథమాంకము.

### నాంది

ఉ॥ శ్రీమహిజా సరోజముఖి • చిత్తముఁ గొందల మొందఁజేసి మా
యామహిమాఢ్యుఁడై యలరు • నా రజనీచరు తేజమార్చి త
ద్భామినిఁ బ్రేముడిన్ గొను ప్ర • భాకరమాన్యకులోద్భవుండు నా
నామహనీయకార్యరచ • నాఘనుఁ డోముత మిమ్ము నిచ్చలున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

సీ॥ హరిహరబ్రహ్మల • కనసూయ గల్పించె
శైశవప్రాయ మే • శక్తివలన
వెలయించె సావిత్రి • విభుఁ బునర్జీవితు
గను నట్టి మాహాత్మ్య • గరిమవలన
ఒనరించెఁ బొల్లి సూ • ర్యోదయంబునకు సు
మతి యవరోధ మే • మహిమవలన
సలిపె నరుంధతి • చణకంబులుగ శిలా
ప్రతతుల నేప్రభా • వంబువలన
జలధివలయిత మేదినీ • చక్రమెల్ల
నిలిచెఁ దిరమయి యెద్దాని • వలన నట్టి

సారపరమపతివ్రతా • చారవిభవ
భవ్యరాజ్యంబునకు నభి • వాదనంబు॥

ఓ పరిషన్మహాజనులారా ! బూజ్యులరగు మీరాజ్ఞాపించినట్లు నిఖిలజనాహ్లాదకరంబగు రూపకము ప్రదర్శించుటకు సర్వప్రయత్నము లొనర్చితి. (శ్రుతి) ఏమనుచున్నారు ? నాటకము పేరేమనియా ? సరోజముఖియను నవీననాటకము (తెరవంకఁజూచి) పారిపార్శ్వకా ! ఆలసించుచుంటివేల ?

పారి- (ప్రవేశించి) అయ్యా! క్షమింపుము. పాత్రంబులు సిద్ధపరచు టలో నాలస్యమైనది.

సూత్ర- రంగస్థలమంతయు సంసిద్ధముగ నున్నదా ?

పారి- సాంఘికులెల్లరు పాత్రంబులు ధరించిరి. మీయాజ్ఞయే యవ శిష్టము. కాని-

సూత్ర- కాని యనుచుంటివేల?

పారి- కవినామధేయ మీ సభాసదుల కెఱిగింప వలదా ?

సూత్ర- అదియా నీ సందేహాశల్యము ! అట్లయిన నిదిగో విన్నవించు కొనుచున్నాఁడను. రసజ్ఞాగ్రేసరులరగు నోసభాసదులారా! బ్రిటాన్వయసంభవుండును బుధజనవిధేయుండునగు నాంజ నేయాభిధానుం డీనాటకంబు రచించె. మరియు నాతండు మీతో నిట్లు విన్నవింపుమనియె.

ఆ॥ వె॥ బాలకుఁడను అందుఁ • బ్రథమప్రయత్నంబు
పాండితియు లవంబు • ప్రాజ్ఞులార!
తప్పులున్నయెడల • దయను మన్నింపుఁడీ
తనయు నెలమిఁ దల్లి • దండ్రులట్లు॥

అదిగో విక్రమార్కుఁడు కొలువు తీర్చియున్నవాఁడు. కావున సముచితసంవిధానంబునకై నేగెదఁగాక.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# సరోజముఖి

## ప్రథమాంకము.



### 1-రంగము ఉజ్జయిని.

(విక్రమార్కుఁడు, ప్రభాకరుఁడు, రజనీచరుఁడు, చంద్రకేతుఁడు,
కాశ్యపుఁడు ప్రవేశింతురు )

విక్ర- నృపకుంజరులారా! మనకీవాదములతో నేల? ఈయుగంబున

శా॥ సీతాచంద్రమతీవిదర్భతనయా ♦ శీతాంశుబింబానన
వ్రాతంబున్ బలె సేతుసీతనగప ♦ ర్యంతాఖిలక్ష్మాతలిన్
పాతివ్రత్యమహాప్రభావగరిమన్ ♦ భాసిల్లుచున్ లోక వి
ఖ్యాతశ్రీఁదనరారునట్టి జలజా ♦ స్యల్ కల్గిరన్ దెల్పుఁడీ!

చంద్ర- విక్రమార్క మహీపాల ! ఆయుగంబులందుఁ బతివ్రతాశిరోరత్నంబు లనఁదగు కాంతారత్నంబు లుండిన నుందురేమో కాని పాపభూయిష్టంబగు నిక్కలికాలంబున నట్టి మానవతీమణు లుండుట యసంభవమని నాయాశయము. ఐనను మేధావంతమగు తక్కిన సామంత మండలంబుండెగదా!

రజనీ- రాజపురందరా ! యీ స్వల్పవిషయంబునకై వేర యోజింపవలయునా. కవులు పనిపాటలు లేక గోరంతలు కొండంతలుగఁ జేసి గ్రంథములు వ్రాయుటచే వానిని జదివి మనమును అంధ

ప్రాయముగ విశ్వసించుచున్నారమే కాని ముంజేతి కంకణమున కద్దమేల యనునట్లు నీకాలమునఁ బ్రవర్తించు కాంతల ప్రవర్తనాదులను మనము కన్నులార వీక్షించుచుండియు నన్యథా భావింపనేల?

సీ॥ కోపించె నాథుఁడు • నోపంగ లేనంచుఁ
గూపంబులను దూకు • కోపినులును
కార్పణ్యములు పెంచి • తీవ్రమతులై తారె
నేప్పులఁ జూపెడు • నెలఁతుకలును
అన్యాయముగ విటు • మాన్యాల సమ్మ్రించి
సన్న్యాసులను జేయు • జారిణులును
అందగాండ్రను గాంచి • సందియంబుల డించి
పొందువాంఛించెడు • సుందరులును

గీ॥ ప్రబలి పతులకుఁ బరులయి • పరగుచుండి
సగ్గు నెగ్గును నెంతయు • మ్రుగ్గజేసి
పగ్గె సిగ్గుల గగ్గోలు • పరచి జగము
గ్రాలుచుండిరి యిక్కలి • కాలమునను.

మహారాజ! వేయేల? సాధ్వీలలామలు ఈయుగంబున లేరనుట ముమ్మాటికి నిశ్చయము

కాశ్య- లాటరాజా! జగన్మాతయు నసతీనిలయంబని వాక్రుచ్చి పాపమేల నొడిగట్టుకొనెదవు?

శా॥ చాలుఁ జాలును కట్టిపెట్టు మిఁక వా • చాప్రౌఢిమన్ నెల్ల భూ
పాలవ్రాతము చుల్కఁ జేయుననుచున్ • భావంబునం దెంచకీ
లీలన్ నిందు సభాస్థలంబున సునా • సీకంబులన్ గుప్పిరా
రా! లాతుల్ నినుఁ గాంచి నేస్తురుకదా • రాజన్యచూడామణీ!

ప్రభా- రజనీచరా! కాశ్యపుని పలుకులు గర్హింపఁదగినవి కావు. నీ వనినట్లు కులటలు సైతము లేరని నేను వాదింపను. కాని దేశము గొడ్డుపోలేదు. సూర్యచంద్రు లున్నంతదనుక నహర్ని

శంబులు సంఘటిల్లునట్లు ప్రపంచమున్నంతకాలము సుగుణ గరిష్టలును దుర్గుణవరిష్టలు నుందురు. వార లొకయుగంబున నుండుటయు వేరొకయుగంబున లేకుండుటయుఁ బొసగదనుట నిర్వివాదాంశము. నీవనినట్లు

ఉ॥ కైతల చాతురీమహిమ ♦ కాదు గుణస్తుతి యుక్తవర్ణన
వ్రాతముకాదు నేర్పున ల ♦ వంబు ఘనంబుగఁ జూపునట్టి బల్
కైతవపుం గవిత్వమును ♦ గాదు తలంప ధరాతలంబునన్
పూతచరిత్రలైన పుర ♦ బోషులు కల్గిరటంచుఁ బల్కుటల్.

కవితారూపంబున నున్న యధార్థంబును లోకంబునకు విదిత పరచు వ్యాస వాల్మీకి ప్రముఖు లిప్పటివారివలె నిజముగాని వర్ణనలచే మానవులను విస్మయాపూర్ణవనిమగ్నులఁజేయ నెంచలేదు. అట్లొనర్చుటవలన వారికి లభించిన ప్రయోజనంబును గానరాదు. ఇట్టినట్టి లోకోపకారపరాయణుల నిష్కారణంబున నిందించుట నీతికాదు.

చంద్ర- (తనలో) ఇప్పట్టున వీరికలహాంకురమును మదీయవచనాంబుధారలచే పెంచెదగాక. (ప్రకాశము) ఏమి! లాటరాజా! మిన్నకుంటివి?

రజనీ- పాపము విదర్భాధిపతికి విద్యానుభవమేకాని లోకానుభవము మాత్రము లోపము.

శాక్య- ఏలాగువలన?

రజనీ- అతనుగింభీరోపన్యాసమువలన

ప్రభా- రజనీచరా! నేను సత్యమునకు విరుద్ధముగా నుడువలేదు.

రజనీ- అసి నీవు మాత్రమెంచితివి కాఁబోలు. లేకున్న నట్టిపతివ్రత లుందురని యితరులెవ్వరేని సాహసించి పలుకుదురా? పాతివ్రత్యమనునది పూర్వకవుల తాటాకులలోనున్నది నీబోటి యజ్ఞానుల మానసములలోనున్నది. కురూపిణుల యందున్నది. అంతియేకాని

క॥ ఎక్కడి పాతివ్రత్యం
బెక్కడి నారీమతల్లు • లీ కలియుగమం
దక్కట భేదము నెంచగ
నక్కయు నాకమను పగిది • నరవర కాదే.

కాశ్య- (నవ్వి)నీపలుకులంబట్టిచూడ నీవ సకలజ్ఞుండవని తేట తెల్లమగు చున్నయది.

ఉ॥ నీతిని గూల్చద్రోచి రజ • నీచర లేమల నిట్లు దూరగా
నీతలభారమేమిపడె • నేర్పున నీవనినంతనే సరో
జాతముఖీలలామలవి • శంకటకీర్తికి లోపమౌనె నీ
కాతరచిత్తవృత్తిమెయి • గారులు ప్రేలితిగాక దుర్మతీ!

విక్ర- కాశ్యపా! అయిన నీయాశయమేమి ?

కాశ్య- ప్రభాకరవాక్యప్రతిపాదకమే నా యాశయము.

చంద్ర- సార్వభౌమ! కాశ్మీరపతియగు నీకాశ్యపుడు చిన్నతనమునం దనకు ధనుర్విద్యాపాండిత్యము గరపిన విశ్వాసముచే ప్రభాకరుని పక్షమూని యిట్లు పలుకుచుండెనేకాని నిజ మాలోచించిన

గీ॥ విరుల నెత్తావి నోల్లని • వేదురులును
విమలగానామృతమురోయు • వెంగళులును
మోహనాకారులను గాంచి • మోదమంది
కలియంగోరని కామినుల్ • గలరె భువిని.

ప్రభా- చంద్రకేతుండు యుక్తియుక్తముగ మాటలాడుట కింకను కొన్నిదినములు నేర్వవలెనని నాతలంపు.

రజనీ- అగును. యుక్తాయుక్త వివేకహీనుల కట్లేయుండును. కాకున్నం గన్నులారం గాంచుటలేదా?

ప్రభా- ఎవరిని ?

రజనీ- పురుషులను

కాశ్య- ఎట్టివారిని ?

రజనీ- బహుభార్యాభోగపరాయణులను

ప్రభా- రజనిచరా! నీమాటలు కడువిచిత్రములుగా నున్నయవి.

రజనీ- ఇందు విచిత్రమేమున్నది? పురుషులు అగ్నిసాక్షికముగా కుల కాంతలను వివాహమాడియు, దురితపథసంచారులై, విజ్ఞాన విదూరులై, జాతి యనక భీతి యనక ఈడనక కీడనక నింద్య మనక నిష్ఠురమనక, పరసుందరీమణులఁ గాంచినమాత్రమున మోహితులై వారింగూడి యెట్లు భోగపరాయణులగు చున్నారో

పరిభా- అట్లే స్త్రీలు సైతము పరపురుషులతో భోగింపఁ దలంచు చుందురనియా నీ తాత్పర్యము?

రజనీ- అగును

ప్రభా- నీమాటలఁ జూడ నాలో నాకే సిగ్గగుచున్నయది. కుకవుల మానసంబులకు సర్వాలంకార సమన్వితంబులగు సద్గ్రంథము లన్నియు దోషభూయిష్ఠంబులుగఁ గోచరించుమాడ్కి అంధు నకు జగమంతయు నంధకారమయంబై తోచు చందంబున, ధర్మాధర్మపరిశీలనాశూన్యంబగు నీ మదికి ప్రపంచమంతయు నసతీసలయంబైయున్న తెరంగునఁ గాన్పించుచున్నయది. అకటకటా! నీపాపంబునకు మేరగలదా? జన్మకారిణులై, లోకో ద్ధారిణులై, కీర్తిలతాలవాలములై తనరారునట్టి మాతృదేవ తల నీవిధముగా దూషించు దుష్టాత్ముల నాలుకలు వేయి చీలి కలుగాఁ జేసినను బాపమున్నదా! అగును. నవమాసములు మోసి కని మూత్ర పురీషంబులఁదోగి దృష్టితాకునేమో యను భయమున బయలువెడలనీక సుగుణవంతులై, కీర్తి దాయకులై సకలవిద్యాజ్ఞాన సంపన్నులై నెగడునట్లు గోరుచు కంటిని రెప్పవలెఁ గాపాడుచు నల్లారుముద్దుగాఁ బెంచి పెద్ద వారి నొనర్చినందులకు మనమిట్లు దూషింపవలసినదే! చాలు చాలు! మిన్నకుండుము.

విక్ర- మేలు! ప్రభాకరా! మేలు!

## కవిరాజవిరాజితము.

వి|క్ర-

తిరముగ నాదు మ♦దిని నినుమెచ్చితి♦ధీమణివౌదువు భూవర! యీ
గరితల మూలమ ♦ గాదె సమస్త జ ♦ గంబనపాయత నిల్చుటయున్

చం|ద్ర-

సరిసరి యేటికిఁ ♦ జాల నుతించెదు ♦ సారవిహీనపు బల్కులకున్
ధరణిని గల్గు బు ♦ ధ|వజమెల్లను ♦ ధర్మమటంచును నెంచునొకో

రజనీ-

తటుకున రాధయు ♦ తారయు లోనుగఁ ♦ దన్వులుగూడరె జారతతిన్
కటకట! వారల ♦ కన్నను నీకలి ♦ కాలపు చేడియ లెక్కుడొకో

కాశ్య-

అటులననేటికి ♦ నందరునాతుక ♦ లాగతి నుందురె ♦ యెందునృపా!
దిటముగఁ జంద్రమ ♦ తీదమయంతుల ♦ దీటగు బోటులు లేరె ధరన్?

రజనీ-

నరవర! యేటికి ♦ నమ్మొదవీగతి ♦ న్యాయమెరింగినవాఁడవునై
సరసిజు కైనను ♦ సాధ్యమెసుంతయు ♦ చానలమాయలు కన్గొనగన్

ప్రిభా-

హరహర! కాంతల ♦ నందరినీగతి ♦ నారడిబెట్టగ నీతియెనీ
కరణినిబల్క న ♦ ఘంబనితోచదొ ♦ గర్వపుమాటలు మానుడొగిన్

రజనీ-

గరువపుమాటలు ♦ గావుసుమీయివి ♦ కాంతలయందు పతి|వతలో
ధరణీధవా! తగ ♦ ధారుణిగల్గిన ♦ దాపగనేటికిఁ జూపుమికన్

ప్రిభా-

అరమరలేటికి ♦ నందరురాజులు ♦ నౌనని మెచ్చగ నీసభలో
తెరవలలోన బ ♦ తి|వతలుండుట ♦ తేటపడంగను జూపుదిలన్

రజనీ- ప్రభాకరా! చూపెదఁ జూపెదనని వాక్చాతుర్యమును జూపి చూపరులకు స్తోత్రపాత్రుఁడవైనంతమాత్రమునఁ బ్రయోజనంబేమి ?

కం॥ భూపాలు రాలకింపఁగఁ
జూపెదనంచును ప్రతిజ్ఞ ♦ జూపెదవేదీ
చూపుమొకపతిని గాళల
మేపారఁగ కాదటంచు ♦ నేవాదింతున్.

ప్రభా- రజనీచరా ! చూపుమని చేలవై వేర యడుగనేల ? నీభార్య పతివ్రత ! నాభార్య పతివ్రత ! శ్రీ విక్రమార్క-సార్వభౌముని యంతఃపురము పతివ్రతామయము !

చంద్ర ! ( తనలో ) ఆహా ! ఇతఁడెంతటియుక్తిని బన్నినాఁడు.

కాశ్య- ( తనలో ) ఓహో ! శ్రుతిమించి రాగమునబడె నన్నట్లు వీరివాదము లంతకంతకుఁ బెచ్చుపెరిగి తుదకు అంతఃపుర కాంతాపరిశీలనంబునకు దిగినవే !

రజనీ- ( తనలో ) ఆహా ! ఈకృపాసముద్రుని సర్వజనసమాదరణీయ వాక్సుధాలహరి కడుంగడు శ్లాఘనీయము. కాదేని జగజ్జాలంబులన్నియుఁ బతివ్రతా శూన్యములని సిద్ధాంతీకరించు నాయందు లేశమైనను నీర్ష్యాభావంబు వహింపక " నీభార్య పతివ్రత " యని యుగ్గడించునే ? అకటా ! ఇప్పుడెట్లు కాదందు. మిన్నకుందునా ? ఈరాజలోకముముందు నేనోడిన యట్లుగాదా ? లేరనినచో స్వభార్యాశీలచ్యుతికి నైతమొప్పిన వాఁడనగుదునేమో! కానిమ్ము యింతతో నేను విరమింపనేల ? మాయోపాయంబులచే నైనను నాపంతంబు నెగ్గించుకొని యెదగాక ! ( ప్రకాశము ) ప్రభాకరా ! యేమనుచుంటివి ?

కాశ్య- ఏమనుచుండెనా ? నీయున్మాద మింకను వదలలేదనుచుండెను.

ప్రభా- రజనీచరా ! నీ ప్రగల్భవాగ్ఝంఝామారుతంబులముందు

నావాక్యంబులు చొరనియెడల క్రమ్మఱ నుగ్గడించెద వినుము. నీభార్యపతివ్రత! నాభార్యపతివ్రత! శ్రీవిక్రమార్క సార్వభౌముని యంతఃపురము పతివ్రతామయము.

రజనీ- (నవ్వి) ఎంతయమాయకుఁడవు! లోకమునందుఁ బ్రతిమానవుఁడును తనభార్య పతివ్రతయనియే నమ్ముచుండును. అట్లు నమ్మనిచో సంసరణ వ్యాపారమే సాగదు. మనము బలవంతుల మగుటచే స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నాము. కాని యపార జారవిహారవిచారపూరితమానసలైన యబలలు, పంజర బద్ధకీరంబులవలె నంతఃపురంబులందు బంధింపబడి పరపురుషుని మొగమైనను జూచుటకుగాని వారితో మాటాడుటకుగాని నోచుకొనక దుర్గమస్థల సంస్థిత లయినందున మాభార్యలు పతివ్రతలైరి. అంతియేకాని

గీ॥ కడగి సంద్రంపు టడుగును ♦ గాంచవచ్చు
సోకుదయ్యంబు గదలార ♦ చూడవచ్చు
సురుచిరాడంబర సుమంబు ♦ నరయవచ్చు
కాని స్త్రీల మాయ లెఱుంగ ♦ గలఁడె నరుఁడు.

శా॥ ఆ శేషప్పల కావిలాసముల కాయాలోకనశ్రేలతా
హేలాలీలల నానొమూరముల కే ♦ జేజొక్కుచుం మోహామం
వేలావీచికలం దగుల్కొని మహా ♦ విద్వాంసులుం భార్యలం
వాలాయంబు పతివ్రతామణులుగా ♦ భావించుటల్ చిత్రమే?
మరియు

ఉ॥ ఇంతవివాదమేల ధరణీశ్వర! శ్రీకరవిక్రమార్క భూ
కాంతుకు నీవనం నృపని ♦ కాయముమేలు భణీయనంగ నీ
కాంతపతివ్రతామణియె ♦ కాదని యేను ధృవంబుగా నిరూ
పింతును నీకునైతమిది ♦ విశ్వసనీయమటంచు దోపగం.
ఏ నట్లొనర్పజాలనైతినేని

శా॥ కోపాటోపవిహారవీరసుభట ♦ క్రూరాసిధారానము
క్షేపస్రావిత రక్తసంకలితని♦ స్త్రీజోత్తమాంగుండనై
భూపవ్రాతము గుండెదిగ్గురనగా ♦ భూమండలంబందునీ
పాపంబెందును లేదటంచు బలుకన్ ♦ బాతుర్కశరీరంబికన్

రాజా! సతీమణియని నమ్మియున్న నీభార్యను నామోహ జాలంబులం బడవేతునేని నీవేమి యొడ్డెదవు?

కాశ్య- (తనలో) తదుపరి లజ్జావిహీనుండవై నీభార్యయుఁ గులటయని నిరూపించునంతటి సాహసుఁడవు.

ప్రభా- ఏమియొడ్డెదవని వేర నన్నడుగనేల? నీవట్లొనర్చెదవేని అసతీ నిలయంబగు భూవలయంబున నుండుటకన్న జీవంబుల బాసి యుండుటయే నుచితంబు గావున నీప్రతిజ్ఞయే నాప్రతిజ్ఞ.

విక్ర- (తనలో) అకటా! మిన్నకుండక బేలనై ధర్మసందేహమని యడుగుట తుదకు పౌరుషనిలయులగు రాజకంఠీరవుల కంఠ నాళచ్ఛేదన ప్రతిజ్ఞలతో ముగిసినదే (ప్రకాశముగా) రాజ పురందరులారా! యేల మీకీ యున్మాదము? ఇట్టియంశ ములను వాదములతో తేల్చుట యుక్తముగాని ఘోర ప్రతిజ్ఞల సేయఁజెల్లునా? నాప్రార్థన మంగీకరించి యిప్పటి కైనను మీప్రతిజ్ఞల నుపసంహరింపుఁడు.

చంద్ర- (తనలో) వేసుపురుగువలె నీవిక్రమార్కుఁడు కలహతరువును జంపఁ జూచుచున్నాఁడే (ప్రకాశముగా) సార్వభౌమ! వీరు పౌరుషనిలయులగు నిజక్షత్రియవంశసంజాతులుగదా!

రజనీ- ప్రభాకర! మరచితి. ప్రతిజ్ఞకు నవకాశముంగవలెఁ గావున నీ విదర్భాపురమునకు నేఁడే పయనమై మాసత్రయంబున సఫలీ కృత మనోరథుండవై వచ్చెద. అంతదనుక నీవిచటనే యుండ వలయు. నిర్ణీతదినమున కాశ్మీరనాథుండగు నీకాశ్యపుండును,

మగధాధిపతి చంద్రకేతుండును సార్వభౌముని పేరోలగమున నుండుఁగాక. విక్రమార్కమహీపాలా! ఇంక నేఁబోయివచ్చెద.

ప్రభా- నీబోంటి యవినీతులు కోటిమందియైనను నిష్కళంకచరిత్ర యగు మా సరోజముఖ పాదనఖమేని చూడఁజాలరు. పొమ్ము.

రజనీ- (పోవుచు) విదర్భాధిపతికి విద్యానుభవమేకాని లోకానుభవము మాత్రము లోపము. (నిష్క్రమించును)

విక్ర- (తనలో) అకటా! ఇతఁడిట్టిదుండగములకుఁ బాల్పడునోగదా!

( నేపథ్యమున వైతాళికులు )

గీ॥ విజితరిపుమండలుండగు ♦ విక్రమార్క
ధరణిపాలుని యతుల ప్ర ♦ తాపగరిమ
కరణి మధ్యందినప్రభా ♦ కరమయూఖ
కాంతు లొప్పారు చుండె రో ♦ దోంతరముల॥

విక్ర- రాజవరేణ్యులారా! నేఁటిసభ ప్రతిజ్ఞలతో ముగిసినందులకై వగచెద. ఇంతతోఁ గొలువుచాలింతము.

( అందరు నిష్క్రమింతురు. )





శ్రీ ర స్తు.

# స రో జ ము ఖి

## ద్వి తీ యాం క ము.

---

( ప్రదేశము - విదర్భాపురము - అంతఃపురము )

( సరోజముఖి రాజముఖి కళావతి ప్రవేశింతురు. )

రాజ- తగదు. నీకింతటి స్వార్థపరత్వము బొత్తిగాఁదగదు.

సరో- ఇందు స్వార్థపరత్వ మేమున్నది ?

రాజ- మేమును నీతో సమానముగ సుఖదుఃఖముల ననుభవింపవలసిన వారమగుటచేత

సరో- ప్రియసఖి ! నిష్ఠురోక్తు లేల ?

కళా- దేవీ ! ఇప్పుడైనను నీవిట్టు లసౌఖ్యతగా నుండుటకుఁ గారణము తెలుపరాదా ?

సరో- (నిట్టూర్పుతో) నా కసౌఖ్యత యేమియు లేదు.

రాజ- అమ్మా ! నీవు లేదనిన నమ్ముదుమా ? తామరపువ్వువలె వన్నె దొరంగిన నీముఖస్థితి మానసములోని విచారమును వెలి పుచ్చుటలేదా ?

సరో- చెలీ ! నాకుమాత్ర మీదినము దుర్దినము

రాజ- కారణము ?

సరో- నాహృదయము చేయిపెట్టికలచినట్లున్నది. శరీరము కంపమెత్తు చున్నది. నాథుఁ డెట్లుండెనోగదా !

రాజ- నాథుఁడెట్లుండెనోయననేల ? విక్రమార్క సార్వభౌముని సమ తుంబునకేగదా పోయినది.

సరో- పోయినను ప్రాణేశ్వరుపైని నిన్నటినుండి నామానసంబు శంకా సంకలితంబై యొప్పుచున్నయది.

గీ॥ విక్రమార్కవసుంధరా ♦ విభుఁడుఁనన్ను
బిలువనంపెను తనతోడ ♦ బలుకులాడఁ
బోయివత్తును వేగంబ ♦ పొలతిమిన్న
యనుచునేగినప్రాణేశుఁ ♦ డకటరాఁడు॥

రాజ- అమ్మా ! సరోజముఖి ! రాజకార్యాలోచనాపరుండై యేగిన భర్తగారికి ఏకారణముచేతనో పునరాగమనము కొంచె మాలస్యమైనందులకు నీవింత యడలుట న్యాయమా !

కళా- (తనలో) సరే ! రాణిగారి నిట్టూర్పులకు రాజముఖి యోదా ర్పులకు సరిపోయినది.

సరో- రాజముఖి ! నీవెంత వెర్రిదానవు. కొంచెమాలస్యమా ? నేట రేపట వత్తునని పోయినపోక యిప్పటికి రెండుమాసము లతిక్ర మించినవికావా ?

కం॥ ఒక్క నిమేషంబైనను
చక్కని హృదయేశుపాద ♦ సరసీరుహముల్
నిక్కముగా వదలియెరుగ
నెక్కరణిఁ సైచుదాన ♦ నీయలమటకున్॥

రాజ- (తనలో) ఇది యుత్తమాంగనల కుచితమేగదా ? (ప్రకాశము) దేవీ ! ధైర్యము వహింపవలెనుగాని బేలవైయిట్లు తపించిన నేమిలాభము?

సరో- సఖి ! నాది బేలతనమా ?

సీ॥ పాపాటవులగాల్ప ♦ పావకంబగుగాదె
పరగ ప్రాణేశుని ♦ పాదసేవ
యజ్ఞానతిమిరంబు ♦ లణగింపరవిరశ్మి
గాదెప్రాణేశుని ♦ పాదసేవ
భవవల్లికలద్రెంప ♦ పరమకుద్దాలంబు
గాదె ప్రాణేశుని ♦ పాదసేవ
కైవల్యసాధ మె ♦ క్కఁగజేయునిశ్రేణి
గాదె ప్రాణేశుని ♦ పాదసేవ
గాన పతిసేవ కెడమైన ♦ మానినులకు
గలవె యిహపర సౌఖ్యంబు ♦ లెలమినట్టి
సేవలకు దూరమైతి నా ♦ భావమెట్లు
చిక్కఁబట్టుదు కటకటా ♦ చెప్పవమ్మ ॥

రాజ- (తనలో) ఎన్నడును యధైర్యమెరుంగని దేవిగారు నేఁడిట్లు అధీరోచితంబులగు వాక్యంబు లుగ్గడించుటకు గతంబేమై యుండును. అయినను మాటల వెంట నడిగిచూచెద! (ప్రకాశము) అమ్మా! మహారాజుగారు వెళ్ళినదిమొదలు లేని విచారము నేఁడిట్లధికమాటకు కారణమేమి ?

సరో- చెలీ! మాటలసందడిని మరచిన నాథయజ్వరమున కపథ్యమ వైతివిగదా !

రాజ- దేవీ! అట్లనదవేల? వివాహకాలమున మీతండ్రిగారు నన్ను మీ దాననుగా నిచ్చినది మొదలు మీ ప్రాణసఖననిపించు కొనుచు మెలఁగునాయెఁదు మీరిట్లు విచారమును వెలిబుచ్చు కుండుట న్యాయమా ?

కళా- (తనలో) ఈ రాజముఖి మాటలంతకంతకు పెచ్చు పెరుగు చున్నవే? తానొక్కతయే ప్రాణసఖియట! తక్కినవారెవ్వరు

కారట. ఏమీా దీనికండగరువము ? సరే. ఈసమయమునసే దీనితో పోరాడి శృంగభంగ మొనరించెదగాక. (ప్రకాశము) దేవీ ! మావోంట్లకు జెప్పకపోయినను ప్రాణసఖియగుటచే నిరాజముఖికి మాత్రము మీాదుఃఖకారణమును జెప్పఁడు.

సరో- చెలులారా ! నాయలమట నేమని చెప్పగలను. గడచినరాత్రి

రాజ- అంతతో నూరకుంటివేమి?

సరో- అయ్యో! తలచుకొనిన గుండె లదరుచున్నవి చెప్పజాలను.

రాజ- అమ్మా! ఇట్లని నీవూరకున్న నెట్లు ! ఆవిషయమేదో నాతో జెప్పుము. సాధ్యమైనంతవరకు మీావిచారాపనయమునకు సహాయ మొనర్చెద.

సరో- అక్కటా ! నావిచార మపనయించునదికాదు. నేనొకపాడు కల గంటిని.

రాజ- దేవీ! ఇంతమాత్రమునకేనా ఇంతవిచారము. కలలు నిజము లగునా ?

సరో- అట్లనకుము. ఆకల యిప్పటికిని నా కన్నెదురగాన్పించుచున్నది.

రాజ- అంతటి దుస్స్వప్నమేదో జెప్పరాదా ?

సరో- మాయావియు పాపనిరతుండుచు నగు రజనిచరాధముండొకఁడు నన్ను గవయనెంచినట్లును, వెంటనే నాథుండు రక్తమాల్యానులేపనవసనధరుండై యా రక్కసు బారదోలినట్లును గంటిని.

మ॥ కలయో నిక్కువమో యెఱుంగ నకటా కానున్న దేమో మహిం
గలనో లేనో విభుఁ గనుంగొనెదు భాగ్యం బబ్బునో యబ్బదో
విలసద్భావుని భక్తవత్సలుని శ్రీ విశ్వేశు కారుణ్యము
న్గలదో లేదో దలంచి చూడ నయయో నాభాగ్య మెట్లున్నదో.

రాజ-(తనలో)అక్కటా! దేవిగారింతటి దుస్స్వప్నముంగాంచిరి. గనుక నే యింతటి దుఃఖము నొందినది. అయ్యో! మహారాజుగారెట్లుండిరో కదా! ఈమె నిప్పట్లు నెట్లూరడింపగలను. అయినను స్వప్నాంతమును జెప్పలేదుగదా? అడిగిచూచెద (ప్రకాశము) అమ్మా! స్వప్నపర్యవసానమును జెప్పకపోతివిగదా?

కళా- (తనలో) చెప్పుటకు రాణిగారంతభయపడుచున్న దీనికింత తొందరయేల? (ప్రకాశము)దేవీ! పాపము రాజముఖి మీవిచారమును దుదముట్టించుటకు బహు ప్రయాసపడుచున్నది. వేగముగా జెప్పుడు.

రాజ- కళావతీ! వేగముగా జెప్పుమని పరిహాసముగ మాట్లాడెదవు. విచారము నెరింగి యూరడించుట తప్పా?

కళా- తప్పని యెవరనిరి? తప్పెఱిగినవారి మాటలు తప్పులగునా?

రాజ- కలహాశనివగు నీతో నెవరు పోట్లాడగలరు? దేవీ! తదుపరి నేమయ్యె?

సరో- తదుపరి ప్రాణనాయకుఁడు శ్వేతవస్త్రమాల్యానులేపనకాంతి పుంజంబులు దిక్తటంబులకుం బర్వ భద్రగజాధిరూఢుండై పురంబు ప్రవేశింపగంటి, నింతలో వందిజనస్తోత్రపాఠంబులు చెవిసోక మేల్కాంచితి.

రాజ- అమ్మా సరోజముఖి! నీస్వప్నము ప్రారంభమున నశుభముగానున్నను శుభపర్యవసానమైనది గనుక భయపడ నవసరము లేదు. కావున నూరడిల్లుము.

కళా- దేవీ! ఈరాజముఖి వాక్కులు వేదవాక్కులు. విశేషించి మీకు భర్తగారు దగ్గర లేరను విచారమును లేకుండజేయునది. మావంటివారల మాటలకేమి' మీకుఁ దల్లియుఁ దండ్రియు దైవము సమస్తమును నీమెయే.

రాజ- కళావతీ! మొదటినుండియు నీవిట్లనే యనుచుంటివి, తల్లి దండ్రి దైవము అందరు నీమే యని చెప్పుటకు నీకంటికి అంత కనబడకయుంటినా? కొంచెము విచారించి మాట్లాడుము.

కళా- విచారించక నేను పోట్లాడినదేమి? నీ వూరకున్నదేమి. కలహా శనివని నీవే యంటివిగదా! రాణిగారికి ప్రాణసఖిని నేనట్లంటె అట్లే జరుగునని నీనోటికి వచ్చినట్లెల్ల మాట్లాడజొచ్చితివి గాని ఎట్లైనను నీవును దాసివే నేనును దాసినే. గనుక బుద్ధి తెచ్చుకొని నోరుమూయుము.

రాజ- కయ్యమునకు కాలుద్రవ్వెడు నీతో నెవ్వరేగగలరు.

కళా-అగును. పాపము నేమియు నెరుగని శాంతురాలవు నివొక తెవే!

రాజ- నీవన్నంతమాత్రమున నగుదునా ?

కళా- నీవన్నంతమాత్రమున ననుచూచితివి. నీవంటి జ్ఞానవతివిని నేనంత నీచురాలనా.

రాజ- నాకున్న దేవిగారింటిపట విచారములో నుండగా నీవిట్లు కల హింపజొచ్చుదువా ?

కళా- అబ్బా! ఎంతటిజాణవే ? నీమాటల నేర్పుచే దేవిగారికిని కోపము వచ్చునట్లు జేయుటకు రాణిగారిదుఃఖమున నీవు విచారించుదానవును నేను సంతోషించుదాననుగా మాట్లాడు చున్నావుగా! ఆహా! నిన్నేమనవచ్చును.

రాజ- ఏమియనుటకు రాణిగారి దాసినిగాని నీదాసినిగాను.

కళా- రాణిగారి దాసివిగనుకనే యింతగర్వము

రాజ- నాగర్వము నిన్నేమి చేసినది?

కళా- చేయలేదు. చేయింపనున్నది.

రాజ- ఏమిచేయింప నున్నది?

కళా- యుద్యోగనాశనమును

రాజ- దానివలన నాకేమి లాభమున్నది?

కళా- లాభము లేకేమి? నేను లేకున్న నీవాడినదాటయు నీవుపాడినది పాటయు నగును. సర్వవ్యాపారమును నీమొగముమీాదనే సాగును. నీకన్నులింతమండిపోవుటకు నీవైశ్వర్య మేమిపడి పోయినది? నీవును వొకరి దాసివే.

రాజ- మాటిమాటికి నల్లేరుమీాదికి బండివచ్చినట్లు చుల్కనగా మీాదికి వచ్చెదవు. నీయాటలే సాగించుకొనుము. నీకెవ్వ రడ్డు పడిరి? అడ్డుపడుటకు నీయంత యోర్వ లేనిదానను గాను. నోరుమూసి యూరకుండుము.

సరో- రాజముఖీ! నీవెరుగని కళావతియా! యూరకుండుము.

రాజ- దేవీ! వూరకుండక నేనేమంటిని?

కళా- ఏమియు ననలేదు. నోటికి వచ్చినట్లెల్ల ప్రేలితివి. ఏమిజూచు కొన్న ప్రుల్ళిపాటో నాకు తెలియదు. నేనన్న అంతహీనముగా జూచుచున్నావు. దేవికూడా నీకే యూతయొసగుచున్నది.

సరో- కళావతీ! అట్లనుకొనకుము. మీాయిద్దరియందును నేను భేదముంచి మాట్లాడితినా?

కళా- భేదముంచక యేమి? నీవెరుగని కళావతియా యంటిరి. ఈరాజ ముఖి యన్న పాడుమాటలన్నియు బడుటకు నేనే అంతలీసి వేసినదాననా? దీనిసొమ్మేమైన దినుచుంటినా? నేను దాస్య మునకే కుదిరితిని, తాను దాస్యమునకే కుదిరినది. దీనికున్న వైశ్వర్యమేమి నాకున్న దరిద్రమేమి? అంతటి దరిద్రురాల నైనప్పటికి దీని మాటలను బడెదను.

రాజ- నీవుదరిద్రురాల వెందుకు కావలెను. నీవే రాణివగుము. నీకే దాస్యము చేసెదను.

కళా- రాణినగునంతటి పుణ్యమేయున్న నీవంటి నీచురాంద్ర నందరిని పారదోలింపకుందునా ?

రాజ- అందుకనే భగవంతుఁడు విచారించి నిన్ని పదవికి బంపినాఁడు

కళా- నీపదవి అంతకంటె మండిపోయెనా ?

సరో- చెలులారా ! ఏకగర్భసంజనితలవలె అన్యోన్యమైత్రిగలిగి మెలంగవలసిన మీరు ఈరీతిని కలహములు బెంచుకొనిన చూచినవారు నవ్విపోరా?

రాజ- నవ్విన నవ్విరి. మాకేమి ? అన్నిటికి లోనైనవారికి

కళా- ఎంతచాతుర్యముగా మాట్లాడనేర్చితివి. నవ్వులపాలైన నేనే యగుదును. నీవుమాత్రము దిగంతవిశ్రాంతయశోలతాలవాల మవై నెగడుము. నీవంటి సాహచర్యమోర్వని సద్గుణగరిష్ఠలు లేనిది లోకము మనునా ?

రాజ- మనదు. అందరు నీవంటివారేయున్న తొందరగా ముందరకు వచ్చును.

సరో- చెలీ ! రాజముఖి ! నీకును తోచనట్లున్నది. కలహమునకు యిదియేనా సమయము.

కంచుకి- ( ప్రవేశించి ) దేవీ ! ఎచ్చటనుండియో యొకయోగిని విచ్చేసి హజారముకడ తమదర్శనమునకై వేచియున్నయది.

సరో- త్వరగా ప్రవేశపెట్టుము.

కంచుకి- చిత్తము (నిష్క్రమించి యోగినితో బ్రవేశించి) అదే రాణి గారు (అని నిష్క్రమించును.) (అందరును లేతురు.)

సరో- యోగినులకు సరోజముఖ నమస్కరించుచున్నది. ఈ యాసన మధిష్ఠింపుఁడు.

యోగి- కళ్యాణమస్తు (తనలో) స్వామియగు రజనీచరుని యాజ్ఞ చొప్పున నీయమశీలంబును నంతఃపురరహస్యంబులును నెరింగెదఁగాక (కూర్చుండును.)

రాజ- భగవతీ సమాగమనముచే నేఁడు మాకు సుదినము.

యోగి- అంతఃపురాంగనాసందర్శనముచే నాకును

సరో- దయామయీ! తమరు

ఉ॥ కోపము వచ్చువిల్తుని ల ♦ కోరులతాపము నించుకంతయుఁ
దోఁపఁగనీక సంసరణ ♦ తోయధి పారముఁ గాంచి వెల్గుచుఁ
పాపసమేతులైన మముఁ ♦ బావనముఁ బొనరించు పూన్కియే
మీపనిగా మెలంగుదుర ♦ మేయదయాపరిరంభమాణులై.

యోగి- (తనలో) ఆహా! ఈమె వినయగుణసంపత్తి మెచ్చఁదగినది. (ప్రకాశము) అందుకు సందేహమేమి? సాంసారికవిషయవంతే సిమగ్నులముగాక మెలంగెదు మాబోంట్లకు జగదవనముకన్న వేరుభార మేమున్నది?

సరో- అమ్మా! సంయమినీ! తాము సర్వలోక సంచారిణులును, భూతభవిష్యద్వర్తమానవేదులు నగుటచే నొక్కవిషయము నడిగెద. సెలవిచ్చెదరా?

యోగి- కళ్యాణీ! సంశయమేల? అడుగుము. సర్వజనమనఃఖేదముల నున్మూలింపనేగదా మాసంచారము.

సరో- తమయాజ్ఞయైనఁ జెప్పెద.

గీ॥ నేఁట రేపట నేవత్తు ♦ నెలఁతయనుచు
నేగు దయితుండు రాఁడుగా ♦ యింతదనుక
నెపుడు వేంచేయు నిపుడుతా ♦ నెట్టులుండె
వేగఁజెపుమమ్మ వీనుల ♦ విందుగాక.

యోగి- (తనలో) పాప మింతవరకు జరిగిన సమాచార మెరుంగదు. నిజముచెప్పినచో స్వకార్య విఘ్నమగునేమొ! కానిమ్ము. ఇట్లు చెప్పెదగాక. (ధ్యానమునటించి) బిడ్డా! మా యోగబలంబున గనుగొంటిని. నీవు చింతాసాగరమున మునుంగవేని-

సరో- (సంభ్రమముతో) అమ్మా! అటులనుచుంటిరేల? నాధుండు క్షేమమేగదా.

యోగి- (తనలో) ఆ! మారజనీచరుని ప్రతిజ్ఞ నెరవేరువరకు (ప్రకాశము) ఒకవిషయమును చెప్పందలచితి.

సరో- (అదలుతో) తల్లీ! నాధుండు-

యోగి- ఇప్పుడు విపత్తులో-

సరో- హా! నాధా! (అని మూర్ఛిల్లును.)

రాజ- (ఆవేగమున) అయ్యో! అయ్యో! ఎంతకష్టము. (అని తామరపాకు వీవనచే సేదఁదేర్చును)

కళా- (తనలో) అకటా! పతివిపత్తి శ్రవణవ్యసనము దుస్సహము కదా!

రాజ- ఈమెధరించిన హారమందలి మందారకుసుమము లదరుటచే గుండియలు కొట్టుకొనుచున్నట్లు విశదమగుచున్నది. కళావతీ! లోనికేగి యింత శీతలోదకమును దెమ్ము.

కళా- (తనలో) ఈతొత్తుకూతురు చెప్పు పనులొనర్చుటకు మానసము సమ్మతింపకున్నదిగాని దేవిగారిమీది ప్రేమమాత్రము ప్రేరేపించుటచే పోకతప్పదు. (అనిపోవును.)

యోగి- (తనలో) ఔరా! ఈనారిపతిభక్తి. ఈయమశీల మకుంఠితము. రజనీచరునకుఁ గాదుగదా బ్రహ్మేంద్రాదులకైనను

నీసతీతిలకమును తేరిచూడఁ దరముగాదే. ఏమి! వీరిదాంపత్య సౌభాగ్యము. పరస్పరసదృశానురాగసంఘటితచాతురీధురీణుం డగు నత్త్వమ్మీచూలి యెంతయు శ్లాఘనీయుఁడు.

కళా- (ప్రవేశించి) ఇదిగో! జలము.

రాజ- (ముఖముపైఁజల్లి) అమ్మా! యూరటనొందుము.

సరో- (తెప్పరిలుచున్నది.)

యోగి- (తనలో) రాహుగ్రముక్త సుధాకరమూర్తివలె నీమె తెలివి నొందుచున్నది.

సరో- (లేచి) హా! ప్రాణనాథా! నాపాదుకల కల్లయని మానసము నందుఁ దలంచితిఁ గాని యీవిధముగఁ బరిణమించునని తలంపనైతిఁగదా! (యోగినిదిక్కై) అమ్మా! నాథుని సమాచారము విశదముగ నెరుంగఁజెప్పి-

యోగి- నేను ముగింపకముందే-

కళా- " ఇప్పుడు విపత్తులో " నని చెప్పితిరి.

యోగి- "విపత్తులోనుండెనని కలయందైనను తలంపకుము, కతిపయ దినంబులలో నీనాథుండు రాగలండు. కాని కొండొక సామంతనృపతితో వైరము సంఘటిల్లు" నని చెప్పబోతిని.

సరో- అమ్మయ్య! ఇప్పటికిఁగదా నామది యూరటబొందినది. యోగి నీమణీ! ఏవిషయమున పరరాజుతో వైరము సంభవించును. రాజ్యకాంక్షచేఁ గాదుగద!

యోగి- కాదుగాని విశదముగా నుడువఁజాల.

రాజ- భగవతీ! తాము పొరబడుటలేదుగదాయని యీదాసురాలి సందేహాశల్యము.

యోగి- ఏమీ! పొరబాటా! నీవుతప్ప యింతవరకు నేచెప్పు ఫలాఫలము లవిశ్వసనీయములని యెవ్వరు వాక్రువ్వలేదు. అగును. పాత్రాపాత్రవిచక్షణాశూన్యముగ మిమ్ముల సందర్శింపవచ్చుట పొరబాటుగాక మరేమి?

సరో- పూజ్యురాలా! అజ్ఞానముచే నోరుజారినది. కోపము వహింపక క్షమింపుఁడు.

కళా- ఈ రాజముఖికి నేమి పోగాలమువచ్చినదో నాకుఁ దెలియదు. నావంటివారినందరిని తృణప్రాయముగఁ జూచుటయేకాక సత్యనిరతలై ఆగతానాగతజ్ఞానలై తపోనిష్ఠాగరిష్ఠలై యొప్పు యోగినులను సైతము తేలికచేసి మాట్లాడుచున్నది.

రాజ- కళావతీ! నీముందు నేను బ్రతుకునట్లులేదు. చేటుకాల మాసన్నమగుటచేతనే యిట్టి నీచప్రలాపములు నీనోటినుండి వచ్చుచున్నవి. ఎన్నిరోజులు మిట్టిపడెదవులే?

యోగి- (చిరునవ్వుతో) చెలులారా! ఏలకలహించెదరు?

కళా- మొదటినుండియు దీనికి నాయునికి గిట్టదు. సర్వాధికారము తానొక్కతెయే పూనవలయునని కోరిక.

సరో- కళావతీ! ఇందు నీవూరుకున్నదేమి? ఇద్దరును సభాసనలే యూరకుండుము.

యోగి- మీరిద్దరొక్కచోనున్న పొసగనట్లు దోచుచున్నయది.

కళా- ఎప్పటికిని పొసగదు. రాణిగారికిని దీనిమూలమున నాయందే

యసూయ. (సరోజముఖ దిక్కై) దేవీ! నూయమాటలతో పని యేమి ? ఇకమీాద నేనుండిన నిదియుండరాదు. ఇదియుండిన నేనుండరాదు. ఇద్దరిలో నెవరి నుండుమనెదవో చెప్పుము.

సరో- కళావతీ! అట్లనకుము. నీవొక తెవు ఇదియొక తెయునా? ఇద్దరు నుండవచ్చును. ఎవరుపోనేల.

కళా- అది యెప్పటికిని సరిపడదు. దీని మాయమాటలచేత మీారును నన్నే యనుచుందురు. గనుక నేనే పోయెదను. నా యును రెప్పటికైనను దీనికి గొట్టుకపోవునా! ఇది నావలెనే యేడ్చుచు పోవక పోవునా ? [పోబోవ]

సరో- [నివారించి] కళావతీ! పోకు పోకుము. నన్నుఁ జూచెదవా ? దీనినిఁ జూచెదవా ?

కళా- మిమ్ములను జూచుటచేతనే యింతవరకు వచ్చినది. అన్నిమాటలకు నన్నే మందలించితిరిగాని దీనినొక్కపరియైన ననకపోతిరి. మీానేఃకుచు నాకును ఋణముతీరినది. ఇఁక నేనుండను

రాజ- అమ్మా ! అంతబలవంతమేమి ? ఎన్నిరోజులు పోవునో చూచెదము. పోనియరాదా ?

కళా- నీదాస్యమునకు వచ్చినప్పటి కందువులే

(నిష్క్రమించును.)

సరో- చెలీ ! మొదటినుండి యిది యిట్టిదియేయని తెలిసియు నీవును మిన కుండవైతివి ?

రాజ- పోనిమ్ము. ఇట్టి నీచురాండ్రుండుట మీాకే కీడు.

యోగి- (తనలో) ఈకళావతీనిర్గమనము మాకుఁ గొంత ప్రయోజనము చేకూర్చునని తోచుచున్నది. తరువాత కర్తవ్యాంశ మాలో

చింతుంగాక. (ప్రకాశము) అమ్మా! సరోజముఖి! దేవతార్చన సమయమైనది. పోయివచ్చెద.

రాజ- ఎవరక్కడ?

కంచుకి- (ప్రవేశించి) దేవిగారియాజ్ఞ.

సరో- కంచుకీ! భగవతికి వలయు సంభారముల సమకూర్పుము. పొమ్ము.

కంచుకి- చిత్తము. (యోగినితో నిష్క్రమించును)

సరో- రాజముఖి! నేఁడు మదిమత్సాహము లేదు. అభ్యంతరమందిరమున కేగుదము రమ్ము. (నిష్క్రమింతురు.)





# సరోజముఖి.

## తృతీయాంకము.

రంగము :— విదర్భాపురము.

[ ప్రవేశము:— రజనీచరుడు. ]

ఆహా? ఏమీ! యీపురవైభవము.

సీ॥ సమధికద్యుతిరత్న ♦ సందోహసంకీర్ణ
కమనీయసౌధరా ♦ జములతోడ
చారుచామీకర ♦ కేలికూటసమాన
రాజితోన్నతగోపు ♦ రములతోడ
వివిధవస్తువితాన ♦ విక్రయక్రియజనా
గమసక్తవిపణిమా ♦ ర్గములతోడ
పల్లవఫలసేవ్య ♦ పరవశశుకపికో
ద్భాసితప్రమదావ ♦ నములతోడ

గీ॥ మలయపవమానతాడిత ♦ చలనకమల
డోలికాసుప్తచక్రాంగ ♦ జాలయుతత
రంగసురుచిర పద్మాక ♦ రములతోడఁ
బరగు చుండెను నీవిద ♦ ర్భాపురంబు.

ఉ॥ మిన్నుల నంటఁ బ్రాకు కడు ♦ మేలిమి బంగరు కోటకొమ్మలన్
తిన్నని రాచబాటలను ♦ తీరగు పచ్చనితోరణంబులన్
జెన్నగు రచ్చపట్టులను ♦ నివ్వెరగొల్పెడు దేవళంబులన్
గన్నులపండువై మిగుల ♦ గ్రాలుచు నుండెఁ బురంబు బాపురే॥

ఆహా! నిరంతరవైభవ సమేతంబై, సకలభోగసమాశ్రయంబై, సజ్జనాభిరామమై విరాజిల్లు నీవిదర్భాపురరాజ్యలక్ష్మిని బరిపాలించుచున్న ప్రభాకరుని భాగ్యమే భాగ్యము! ఈతండు ప్రజలనందరిని తనవలెనే తలపోయు నమాయకుఁడు. దూషణభూషణంబుల సమంబుగ జూచు జ్ఞానవంతుండు. శాస్త్రములే ప్రమాణములుగ నమ్మి సంచరించు సత్యవాది.

అక్కటా! అట్టి ధీరోదాత్తుని, హరిదంతవిశ్రాంతయశోధురంధరుండును, న్యాయాన్యాయవిచక్షణాశీలుండును, దుష్టజన దుర్నిరీక్షుండునగు విక్రమార్కమహీపాలు నంతటివాఁడు చూచుచుండ, వేదశాస్త్ర వేలాదృశ్యపండితమండలీ మండనంబగు పేరోలగంబున, బేలనై అలీకవాచాలవారిపూరంబులు ప్రవహింపఁజేసి, పాపంబులగూసి సద్గతికిబాసి, లోకనిందలకు సైత మోర్చి యింతటి ఘోరకృత్యమున కొడిగట్టితి. ఇంతకును నాకర్మగతియే యిట్లు ప్రేరేపించినది. కానున్న.

సీ॥ విక్రమార్కనృపాలు ♦ పేరోలగమునకుఁ
బరివారయుతుఁడనై ♦ యరుగనేల
నరిగితిఁబో నాఁడు ♦ ధరణీశుఁ డుండి కే
పుడమిఁగో సతులంచు ♦ నడుగనేల
నడిగెఁబో ధృతిబూని ♦ యా ప్రభాకరుడుండి
గిల బతివ్రతలంచు ♦ బలుకనేఁ

బలిశిబు యతనికో ♦ బలముగా లేరలే
రనుచు వాదంబులే ♦ బెనుపగాఁ

గీ॥ పెనిచి యాతన బోసిక ♦ పెట్టిదంపు
ప్రతిన బూనగనేల నీ ♦ పగిది దేశ
ద్రిమ్మరితనంబు బూని నే ♦ తిరుగనేల
దైవఘటనంబు జేరికి ♦ దాటనగునె?

మ॥ అకటా! ఘోరపుకృత్యమంచు మదిలో ♦ నాలోచనం బింతయుఁ
బ్రకటం బౌనటు సేయనైతి నెటులీ ♦ పాపంబు ద్రోతుఁ జగం
బిఁక మోమెత్తగ నిచ్చునే నను మహా ♦ హీనాత్ముగా నెంచదే
పికవాణిఁ వశవర్తిఁ జేతునను నా ♦ బీరంబు లెట్లోగదా !

గీ॥ ఇంతకును గారణంబు భూ ♦ కాంతు కొలువు
కూటమున కేను నెలమి నే ♦ గుటయ కాదె ?
అట్లనగనేల ?—రానున్న ♦ యాపదలను
నడవు లందున డాగియు ♦ నాప వశమె ?

ఆహా ! సర్వనియామకుండగు భగవంతుని కృత్యంబులకుఁ బ్రతిక్రియలొనర్ప నెవ్వనికైనను సాధ్యమా ? దైవమా ? నీమాయలు దుర్జ్ఞేయంబులుగదా ! ప్రకృతిసమేతుండవై, సర్వవస్తుసంభరితంబులగు పట్టణంబులను బల్లెలనుగా జేతువు. పల్లెలను నిముషమాత్రంబున మహావైభవసమేతంబులగు పట్టణంబులఁ జేతువు. సన్న్యాసుల త్రిలోకాధినాథ ప్రతిమానవైభవోన్నతులగు మహారాజులనుగా జేతువు. హంసతూలికాతల్పంబుల శయనించు మూర్ధాభిషిక్తుల దేశద్రిమ్మరులనుగా జేతువు. ఘటనాఘటనచాతుర్యధురీణా ! నారాయణా ! అనివార్యంబగు నీప్రభావంబుననే గదా సంజ్ఞామాత్రసకలకార్యనిర్వ

హాణపరివారపరివృతుండనై, చంద్రకాంతశిలానిర్మితసౌధోపరిభాగసంచారుండనై, సరససంగీతవాద్యవినోదుండనై యలరు నేను పురంబు నిర్గమించితి. పాషాణకంటక కలిత మహారణ్యాగతుండనైతి. సుఖపరంపరలకు దూరమైతి. ఆ సరోజముఖి పరిభవోపాయాన్వేషణంబు జేయుచుంటి. కాని చతురుదధివేలావలయిత ధరణీచక్రంబున యశశ్చంద్రికలుపరవ, తులలేని పాతివ్రత్యంబున నెగడి పతిపాదాబ్జంబులుదక్క నన్యచింత మాని కలనైన పరపురుషసందర్శనం బెఱుంగక బాఁపిరివోని సంపదల నెసంగు కులకాంత సరోజముఖి యొక్క తెఱయే యని వినుచుంటి. ఆహా! అట్టి పరమపావనిని, అట్టిదురితదూరిణిని, అట్టి ముగ్ధను భంగపెట్ట నెంచు నీకళినమానసునకు దండధరభటదండతాడనంబులు దక్క వేఱొండు గతి కల్గునా? కల్గకేమి? నాబోంటి పరమపతివ్రతాభంగదీక్షాపరాయణులకు రౌరవాదిమహానరకకూపంబులు భగవన్నిర్మాణములై చిరకాలవాసగతులుగా నున్నవి గదా! ఉండనిమ్ము! ఉండెనని పూనిన కార్యంబును తుదముట్టింప వలయునుగాని మధ్యకాలంబున పాపంబని వదలిన నగరా? నగుదురని వదలక నే చేయున దేమున్నది.

సీ॥ చెప్పనా నృపునిసౌ ♦ శీల్యవైభవమును
అతులసౌజన్యర ♦ త్నాకరుండు
విందునా యాతని ♦ వెలఁది వృత్తాంతంబు
పరమసాధ్వి యటంచు ♦ బలుకు జనము
తలఁతునా వాని సౌ ♦ ధప్రాంగణంబును
బ్రహ్మకునైన దు ♦ ర్గమము భళిర
అందునా యతని స ♦ హాయసంపత్తిని
కలఁడల విక్రమా ♦ ర్కప్రభుండు

గీ॥ తనసమంచితకీర్తి ప్ర । తాపములను
సకలదిక్తటముల వెదఁ । జల్లినట్టి
నిరుపమగుణాఢ్యుఁడగు ప్రభా । కరనృపాల
తిలకుఁ డతఁడేడ నేనేడ । గెలుచు టేడ ?

వృథా ప్రయాసమున శరీరము నలయించుకొనిన దానంగల్గు లాభ మేమి? కావున నీదుష్కార్య మింతటితో విరమించుటయే శ్రేయస్కరంబని తోఁచుచున్నది. విరమించినచో భావికర్తవ్యమేమి ?

క॥ శరణాగత రక్షణమున
బిరుదాంకుఁ డతఁడు గాన । ప్రియమారగ నా
గరుణింపు మనుచుఁ దత్పద
సరసీరుహములకు నెరగ । క్షమియించుఁగదా !

ఛీ! పౌరుషహీనంబులగు నీవాక్యంబులు రజనీచరుని వేనా? సకలరిపుమండలకంఠ సముత్క్షేపరక్తధారాసిక్త సంగ్రామరంగుండగు నీరజనీచరుఁడా ఆప్రభాకరుని మన్నింపుమని వేఁడుట! సూర్యచంద్రుల గతులు తప్పునుగాక! సంద్రంబు లింకుగాక! అగ్ని చల్లారుగాక! శరీరములోఁ బ్రాణంబు లుండునంత వరకు నేనా యిట్టి యమానుష కృత్యమున కొడంబడుట!

నిఖిల రాజకంఠీరవా లంకృతంబగు నిండోలగంబున నాడిన ప్రతిజ్ఞా వాక్యముల నిప్పుడు పందనై వీసరబుచ్చిన పౌరుషహీనుండని గేలిసేయరా? పౌరుషహీనుండగు మానవుండు మహీమండలంబున నుండిన నేమి? మండిన నేమి? క్షత్రియకుల సంజాతుండగు విశ్వామిత్రుని నంతటి వాఁడు మహేంద్రు నాస్థానమున నొనర్చిన సమయంబు నెగ్గించుకొనుటకే కదా నిత్యసత్యవ్రతుండగు హరిశ్చంద్రుని యంతటి వంతలముంచినది. పిదప నోడిన నోడుఁగాక ! ఆమహనీయుండేకదా హరిశ్చంద్రుని విఖ్యాతి ఆచంద్రతారార్కము

స్థిరంబై యుండుటకు కారణభూతుండు. అట్లే నేనును సాధ్యమగు నంత వరకు ప్రతిజ్ఞ నెరవేర్చు కొనుటకు ప్రయత్నించెద. దైవాను గ్రహంబు వలన సఫలమనోరథుండ నైతినేని క్రమ్మర దారాసుతా దుల సందర్శింప గలుగుదుగాక. అపజయంబే కలిగి విగతప్రాణుం డ నైనను ఆసరోజముఖి పరమపతివ్రతామహాత్మ్యమును ప్రపంచసం వేద్యం బగునట్లు చేసిన వాఁడ నగుదు. కావున నెట్లయినను గుండె రాయిచేసికొని, చిత్తంబును వశపరచి, యామె పాతివ్రత్యభంగము నకుఁ బ్రయత్నించెద !

నా ప్రయత్నముల కన్నిటికి సాహాయ్య మొనర్చుచు దోడునీడగా సంచరించు మా విక్రమసేనుఁడుండఁ గార్యసాధన మునకు వే భీతి జెందనేల ? అతఁడే కదా యోగినీవేషధారుఁడై యం తఃపురప్రవేశం బొనర్చి సరోజముఖి చెలికత్తెల వివాదాంశమును నాకు విశదపరచిన మాయలాఁడు. అతండే కదా దాసీత్వమును మాని వచ్చిన కళావతికి బేరాశ కలిగించి యనుదినంబును నాసాన్ని ధ్యమునకు వచ్చునట్లు చేసిన నెరజాణ ! పాప మాకళావతి యాపది దినములనుండియు తాను నిత్యము రూకలమీద రూకలు బహుమాన ములు పుచ్చుకొనుటే యెరుంగును గాని నే నెందులకై యొసంగు చుంటినో సూతయును విచారింప నేరదు కానిమ్ము.

క॥ అతివిస్తర మేలఁ గళా
నతిఁగోడ మదీయకార్య • భారము నేఁడే
వితముగ నైనను విని చెద
క్షితిని వచింపరె "శుభస్య • శీఘ్రం"బనుచున్ ॥

కాని యింతటి ఘోరకృత్యమున కొడంబడుదునా యని సంశ యంబు వొడము చున్నయది. ఒడంబడ కేమి సేయును ? సర్వజన చిత్తాకర్షణీయంబగు ధనమున్నది గదా ! ధనమునకు లోనై మహాదు

హ్కార్యము లొనర్చు మానవు లెందరు లేరు? దానిచే నీకాలమున సాధింపరాని కార్యములు గలవా? ఆహా! ధనమా! నీప్రభావ మెంతని చెప్పవచ్చును!

సీ॥ నీమూలమున గదా ♦ నీతిని విడనాడి
కూటసాక్ష్యంబుల ♦ గూయుటయును
నీమూలమున గదా ♦ నిండు ధైర్యముతోడ
సాధుజనంబుల ♦ జంపుటయును
నీమూలమున గదా ♦ నిగమాదు లన్నియు
నప్రమాణము లంచు ♦ నాడుటయును
నీమూలమున గదా ♦ కామాంధ కారులై
కనుగాన కన్యల ♦ గవయుటయును

గీ॥ అవని నీమూలమున గాదె ♦ యఖిలజనులు
పాపకార్యంబులకు నెల్ల ♦ బాలుపడుట
బుధులు "సర్వాంజగద్ద్రవ్య ♦ మూల"మగుచు
ధనము! నీమూలమున గాదె ♦ తలంచుటయును

(ఆలకించి) ఎవరో వచ్చుచున్నట్లున్నయది. ఎవరో యన నేల కళావతియే యై యుండనోపు.

[ ప్రవేశము కళావతి. ]

కళా!— (తనలో) ఆహా! ఇదంతయుం బరికింపం గనుంగను విచిత్రముగా నున్నయది. నేను నిత్యము తియ్యనీటికై చేపయెక్కిన చందమున రాకలమీది యాశ చేచనుచుంటినే గాని యాతండెవ్వండో యేకారణమున నాకీ ధన మిచ్చుచుండెనో యింతవరకును తెలియదు. కానిమ్ము నేను తొందర పడ నేల? విత్తముసంగు వాండు మనోభీష్టము నివేదింపక యూరకుండునా? కావున ప్రతిదినము వలెనే నేడును

పోయి సందర్శించెదఁ గాక (ప్రకాశముగా) మహాభాగా! నేఁడద్దిరో దీర్ఘాలోచనాపరత్వమున నున్నట్లున్నయది!

రజనీ:— కళావతీ! రమ్ము! కూర్చుండుము. నాదీర్ఘాలోచన కేమి గాని పట్టణవిశేషము లేమి?

కళా:— క్రొత్తగా నడుగుచుంటిరి?

రజనీ:— విదేశస్థుడ నగుటచే నన్నియుఁ గ్రొత్తలే

కళా:— విదేశవాసునకు మాపట్టణ విశేషము లెందులకో?

రజనీ:— ఐనను కొన్నిదినంబులనుండి యీపురంబున నుండుటచే నడుగ వేడుకయ్యెను.

కళా:— సరె! బాగుగా చెప్పితివి! నీ మాటలు నీటియందుండియు నీళ్ళెట్లుండునో యని విచారించు మండూకంబును జ్ఞప్తికి దెచ్చుచున్నయది.

రజనీ:— కళావతి! పరిహాసించెదవు గాని నీవలె నాకును పట్టణసంచారమున్న నిట్లడుగుదునా?

కళా:— సంచారము సేయక మూలఁ గూర్చుండు మన్నవారెవరు?

రజనీ:— ఒకరు గూర్చుండు మన్న గూర్చుందునా?

ఉ॥ కొండిక నాటనుండియును ♦ కోరిక లీరికలెత్త నెందునేఁ
దండితనంబుతో నెదురు ♦ దంటలఁగానక సంచరించు నా
ఖండలతుల్య వైభవు న ♦ ఖండపరాక్రము నన్ను మూల గూ
ర్చుండఁగ జేసె మాయవిధి ♦ చోద్యములాతని కర్మ లెంతయున్.

కళా:— (తనలో) ఇతని వాగ్వైభవంబు లతిగంభీరంబులుగా నుండుటచే మహారాజుగాఁ బొడగట్టుచున్నయది. కానిమ్ము అన్నియు నాతని నోటనుండియే చెప్పించెద గాక! (ప్రకాశముగా) ఏమి? రాచపోకడలు పోవుచుంటివి!

రజనీ:—చతురవచోగాంభీర్య కళావసతీ! కళావతీ!

గీ॥ పర్ణమధ్యస్థమయ్యు సు ♦ వర్ణకుసుమ
వాసనలు దిఙ్ముఖంబులఁ ♦ బరవకున్నె?
జలదపటలంబుచేత సం ♦ ఛన్నమయ్యుఁ
జండమిహిరప్రతాపంబు ♦ సమయునొక్కొ?

కళా:—అట్లే నీవును ప్రతాపవాసనలు భూమండలవిదితంబులుగా నొనర్ప వలయునని యేనా యిట్లన్యజనాగోచరుఁడవై కూర్చుండుట.

రజనీ:—కాలబద్ధుఁడ నగుటచే నిట్లుండితిని

చం॥ అరిబలమర్దనం బొకటి ♦ యైన సదా సుమనోఽభిరామమా
నుతతరరాజ్యవైభవ స ♦ మున్నతియే శతకోటి సేయఁగా
ధరణిని వేయికన్నులను ♦ దాల్చి చూచుచుఁ బ్రోచుఁ రాజది
గ్వరుఁడగు గాని యాతఁ డతి ♦ వా! మరి ప్రాకృతమానవుండటే!

కళా:—(తనలో) మానవపతియే యైన నీమరువులెందులకో?

రజనీ:—కాంతా! ఏలసందియము?

కం॥ నేటికి దాపరికం బిఁక
నేటికి వచియించు చుంటి ♦ నెంచుము నన్నున్
బోటిరో! రజనిచరుఁడను
లాటధరాకామినీ క ♦ ళత్రుఁడటంచున్॥

కళా:—ఓహో! త్వరలోనే తెలవిచ్చినారులే. రాజులతోటి సయ్యాటములు, పాములతో చెరలాటముల వంటివని పెద్దలు చెప్పుదురు. మహారాజులగు మీకును మాకును హస్తిమశకాంతర భేదముండును. కావున మీసాంగత్య మింతతోఁ జాలును.

రజనీ:—కళావతీ! భూపతి నన్నంత మాత్రమున నీకింత భీతియేల?
ఏకారణముననో నిన్న నేడిటు వచ్చుచుంటివి గాని మొన్నటి
వఱకును రాజకూటములో గాదా యుండినది.

కళా:—మహారాజ! ఉండిన నేమి? లోకమునందు ప్రభాకరుని వంటి
రాజమార్తాండులును, సరోజముఖ వంటి పద్మముఖులును
గలరా?

రజనీ:—అంతటి మహానుభావులైనచో వారి నేల వదిలితివి?

కళా:— నాగ్రహచారదోషమున, ప్రభాకర మహారాజుగారు లేక
పోవుటచే నింతటి యలసటవాటిల్లె! అయినను యిప్పుడు దాని
గూర్చి విచారించుట గతజలసేతుబంధనము గదా!

రజనీ:—విచారించ వలసి నంతటి యవసరము లేదు.

ఉ॥ భామరో! దూరమై చనియె ♦ భాగ్యములంచుఁ దలంక నేటికే
కామితమెల్లఁదీర్చి, పెర ♦ కామినులెవ్వన భాగ్యభోగ్యముల్
నీ మనసొప్పఁ గూర్చు రజ ♦ నీచరుఁ డుండ; భయంబు వీడుమా
భూమిపతిన్ ప్రభాకరుని ♦ భూమిని లేఁడని యెంచు మాత్రలోన్

కళా:— అమంగళము ప్రతిహతమాఁగాక! మహారాజ! ఏమి యీ
యుక్తి?

రజనీ:—కళావతీ! అబలవై యింత మాత్రమునకే యులుకుజెందెదవే
కొలది దినంబుల క్రిందట ప్రభాకరుఁడు విక్రమార్క సా
ర్వభౌముని కొలువునకుఁ బోయియుండెనా లేదా?

కళా:—పోయెను. పోయిన నేమి?

రజనీ:—ఏమియు లేదు. ఒకనాఁడా నిండోలగమునుండి పూర్వకాల
మందలి సీతాది మహాపతివ్రతలవంటి సాధ్వీమణు లీకాలమ
నుండిరా యను ప్రశ్నంబు వెడలగా నొక నృపాలుఁడు లే

వాదింపఁజొచ్చెను. దానికి ప్రభాకరుఁడీకాలమున నైత మట్టి పతివ్రత లనేకులుండిరని ప్రత్యుత్తర మిచ్చుచు తనభార్య పరమ పతివ్రతాశిరోమణియని నొక్కి వక్కాణించెను.

కళా:— మహారాజు గారా నాస్తికునకుఁ దగినప్రత్యుత్తరమిచ్చినారు. అగును! చంద్రునినుండి యమృతమొలుకుట యాశ్చర్యమేమి?

రజనీ:— (తనలో) ఆహా! సహవాసజనితప్రేమరసం బంటువాయనిది గదా!

(ప్రకాశము) ఆ దనే ప్రతివాది పతివ్రతయని నమ్ము నిభార్య నుమూడు మాసములలోఁ బతివ్రత కాదని నిరూపించెద. అట్లు చేయ జాలనైతి నేని నా శిరం బిత్తునని ప్రతిజ్ఞ చేసెను.

కళా:—(ఆశ్చర్యముతో) ఆఁ. ప్రతిజ్ఞయుఁ గూడనా? ఎంతసాహసము! అసాధ్యమగు నంతటి ఘోరకృత్యమునకుఁ బాల్పడనెంచిన యాతం డెవ్వఁడై యుండనోపు.

రజనీ:—కళావతీ! ఇంకను రహస్య మేటికి. అట్లు విక్రమార్కుని యాస్థానమున

చ॥ నరపతిలేమ యాలుపుత ♦ నం బరివృత్తు నటంచుఁ బల్కి త
త్పరకృతమానసుండయి వి ♦ దర్భ కిటుల్ చనుదెంచి నీకృపా
తరణి సహాయమేసుర వి ♦ ధానముననె శపథైకసాగరో
త్తరణ మొనర్ప నున్న వసు ♦ ధావిభుఁ డీతఁడె సుమ్ము కోమలీ!

కళా:—ఏమి విచిత్రము! రజనీచర మహారాజా! న్యాయాన్యాయపరి శీలనాదక్షుండవు కావలసిన నీవే యింతటి పాపకార్యంబునకు నుంకించి వైచితివిగా! తరువాత తరువాత?

రజనీ:—తరువాత నాపుడమితేఁడు నిప్రతిజ్ఞయే చెల్లినచో పతివ్రతా శూన్యంబైన యీభూలోకముకన్న నరకలోకమే సుఖమగుటచే నాశిరం బిచ్చెదనని యొప్పుకొనెను. కావున

తే॥ తీవగ నైనను గాని
విమ్మారగ కుడుసుంగఁ జాలు ♦ దీవ లతాంగి
రేవగలు నిదుర పట్టదు
భావగతుల్ వేరు తెరగు ♦ బట్టుటకతనఁ॥

కళా:—ఐన, నిప్పు డేమిచేయు మనెదవు ?

రజ:—ప్రతిజ్ఞాపూర్తిని.

కళా:—అది నాచేతను, నీచేతను, మనలను పుట్టించిన బ్రహ్మదేవుని చేతను కానేరదు. సరోజముఖ యన నేమనుకొనుచుంటివో ! సీతా చంద్రమతీ లోపాముద్రారుంధతుల వంటి పరమసాధ్వి యనుకొనుము. అట్టి యాకళంకచరిత్రను భంగ మొందింతు నని సాహసించుట అగ్నిశిఖను వార్పనెంచు శలభంబుపోల్కి పర్వతంబును ఢీకొన నెంచు మేషంబుభాతి నిను నీవ నాశము చేసికొనుట యగును గాని మరియొక లాగున తుద ముట్టదు.

రజ:—అట్లయిన నాశిరము నీయ వలసిన దేనా ?

కళా:—ఇట్లుచేసి నాశిరము గోడు చేయు మనెదవా ? పంతమునకు ప్రజ్ఞలు కొట్టి చేతకాని పనుల పైవేసి కొన్నందులకు ఫల మనుభవింప వలెగాని, దాని కితరుల సహభోక్తల కమ్మ నిన నగుదురా ?

రజనీ:—కళావతీ ! నావి చేతగాని ప్రజ్ఞ లెప్పటికి గావు. స్త్రీజనము లతిగంభీరహృదయ లనుట కొంత స్వల్పమానసునకైనను దెలియును. లోకమంతయుఁ దమ్ము పతివ్రతలని మెచ్చుకొన వలెననిఁ బైకెన్ని తెరగుల శ్రీరంగనీతులు చెప్పుచుందురు. అంతియేగాని మానసమున నైన, నన్యపురుషుల గవయగోరని మానిను లుండుటకల్ల. ఏమేమో యనెదవు గాని నీకు మాత్రము తెలియదా ?

కళా:—(తనలో) [illegible] నన్నింత నీచపు చెర్యమునకుఁ [illegible]చున్నాఁడు! (ప్రకాశముగా) రాజేంద్రా! నేనాడుమాటలు మీకు హాస్యములుగానుండె గాఁబోలు. ఆసతీజనమణి సత్యమునకిక్క; దయకు గని శౌచమునకు వుంకి. శీలమునకు నెలవు. పాతివ్రత్యసంపదల కొటారు. పతిపాదారవిందముల దక్క నన్యచింతన మెఱుంగదు. ప్రాణనాథుని ముఖకమలము దక్క నన్యదర్శన మెఱుంగదు. అట్టి సతీమణిని చేబట్టనెంచితివే నగ్నిని మూట గట్టనెంచుట కాదనుకొంటివా? అట్టి నారీరత్నమును గవయ నెంచితివే కాలమృత్యువును గాఁగిలింప నెంచుటకాదనుకొంటి వా? అట్టి స్త్రీజనతిలకమనోధనమును పెరుక నెంచితివే కాల సర్పము కోరల పెరుక నెంచుట కాదనుకొంటివా? నీచుఁడు గాని నిర్ధనుఁడుగాని, జారుఁడుగాని, చోరుఁడుగాని, కులఘాతకుఁ డుగాని, కురూపిగాని, యెట్టివాఁడైనను పతివ్రత పతినే పర మదైవముగా చూచుకొనుచుండును. అట్టి నీచగుణముల కింతయైన చోటీక సకలరాజన్య శిరోభూషణనీరాజితచరణపీ ఠుండై అభినవమన్మథాకారుండై సర్వసద్గుణ మణిజాలఖనియై వెలుంగు నినుని యండఁ దప్పించి యన్యుని యండ జేర్ప నెంతజాణకైన యాసాధ్వి సాధ్యమగునా.

అంతటి మహాసభలో చెల్లని పొల్లుమాటలాడి, పోయినం తన, పిలుచు ననుకొంటివి గాబోలు! పలుకరించి నంతనఁ బెబడు ననుకొంటివి కాబోలు. లోకమంతయు నాయర చేత నే యున్నదను కొంటివి కాబోలు. ఇంత పాపమా! ఇంత ఘోరమా! ఇంత కటికితనమా! నరకలోకమున్నదని తెలియదా? ప్రపంచమంతయు నీవలె నుండు ననుకొంటివా? నీ ముచ్చు పోకడలఁ గట్టిపెట్టి పురంబుజేరుము. ఇదే నేనును పోయెద.

రజనీ:- కళావతీ! పోకుము! పోకుము ఏదియేని సాధనమున నన్ని యపాయమునుండి తప్పించితివేని.

కళా:—రాజా! వేయేల? ఎన్ని సాధనములఁ బ్రయోగించినను, ఎన్ని మాయోపాయముల బన్నినను ఆసరోజముఖ మాటలనైన విననేరవు. కాక ఛాయనైనను గాంచజాలవు. నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము.

రజనీ:—ఎట్లయిన నీముప్పు దప్పింప నొప్పను గాని తప్పని నిప్పులు గ్రక్కుచు దూలనాడుట తగునా? నాప్రాణములు నీచేతనున్నవి పాలముంచినను నీటముంచినను భారము నీదియ. ఈవిపత్సముద్రమునకు నావవై యొడ్డుపట్టించిన నీమేలాజన్మాంతము మరువను.

కం॥ తలఁపఁగ నాకార్యము నీ
వలనగు సందియమువల ద ♦ భయమిచ్చి వెసఁ
చెలువా! నన్గరుణింపుము
చెలువారగఁ బట్టమహిషిఁ ♦ జేయుదు నిన్నుఁగా!

నమ్మతిసి చూపుము. మారు మాటాడకుము. ఇవికాళ్లుగాని చేతులుగావు సుమా! (అని చేతులు పట్టుకొనును.)

కళా:—ఆహా! ఇప్పు డెట్లుకాదందు. నావంటివారి నెందరినో కనుసన్నల మెలపు నీమహారాజతిదీనుఁడై ప్రార్థింపనెట్లు ద్రోచిపుచ్చుదు. కానిమ్ము. ఏదేనొక్క యుపాయ మాలోచించి యీతని కృతార్థుచేసిన ఋణవిముక్తియు ప్రాణదానఫలమును గల్గును. పైపెచ్చు నీతిందునన్నుఁ బట్టమహిషి జేయుదు ననుచున్నాఁడు. నాకింతకన్న కావలసినదేమి? (ప్రకాశము) నీవెన్నిగతుల నాలోచించినను హరిహర బ్రహ్మాదుల కైన నామెను జేపట నలవికాదు. నామాటవిని—

రజనీ:—పోనిమ్ము. చేపట్టు వశము కాకపోయినను యేదే నొక కపటో
పాయమ్మును బన్నియైన నాతల నిల్పుము. అంతఃపురంబున
నీవెరుంగని రహస్యములు లేవు. శుద్ధాంతపరిచారికలు కపట
విద్య లల్లుటలో మిక్కిలి నేర్పరులని నేనెరుంగకపోలేదు. అందు
ను నీవు సార్థకనామధేయవు గదా !

కళా:—అని మోయరాని భారమును నెత్తిన నెత్తికొనను. కాని నాకు
సాధ్యమగునంత సహాయమొనర్చెద.

రజనీ:—(సంతోషముతో) ధన్యోస్మి. ధన్యోస్మి. కళావతీ! అంతియే
చాలును.

కళా:—నేను మరల సరోజముఖీసమక్షంబునకుఁ బోయి——

రజ:—అచటనే యుండెదను. నీవు గుటకలు మ్రింగుచు నిచటనే యుం
డుమనెదవా ?

కళా:—(నవ్వి) రాజేంద్ర ! నిన్ను మరతు ననుకొంటివా? నీపని నిమిత్త
మేగుటయేగాని వారిపై దయకలిగి కాదు.

రజనీ:— సరే ! పోయి యేమిచేసెదవు ?

కళా:—నాపై నిందు నమ్మకము కలుగునట్లు కొన్నిదినము లుండి

రజనీ:—ఇంకను కొన్నిదినములా? కొన్నిదినములలోఁ బ్రతిజ్ఞతోఁగూడ
నాయాయువు పూర్తియగును.

కళా:—త్వరలోనే వచ్చెదను లెమ్ము.

రజనీ:—కొన్ని నాళ్ళన్నఁ బిదప?

కళా:—అది రహస్యము. ఇటురమ్ము (అని చెవిలోఁజెప్పును.)

రజనీ:—శబాస్ కళావతీ! నేఁటికిఁ గదా నీనామము సార్థక మయ్యెను.

గీ॥ వేయిజన్మంబులకు నైన ♦ వెలఁదిమిన్న
నీదు ఋణమును దీర్పఁగా ♦ నేరసుమ్ము

నాదు సౌభాగ్యలక్ష్మివి ♦ నాదుపూర్వ
పుణ్యరాశివిగా నెంతు ♦ పూఁబోడి

కళా:—దాని కేమిగాని యింక సెలవొసఁగుము.

రజనీ:—మరల నీ దర్శనము త్వరలో నిమ్ము. అంతలో మరచి పోయె దవు సుమా !

కళా:—సూర్యచంద్రులు గతులు తప్పిన (నిష్క్రమించును)

రజ:—అమ్మయ్య ! ఇప్పటికి నాగుండె కుదురుకొనినది.

గీ॥ దేనికై యిన్నికష్టంబు • లూనితిరుగ
వలసెనో యట్టి కార్యంబు ♦ ఫలితమయ్యెఁ
జెలగి సమధికయత్నముల్ ♦ సలుపు నరుల
కలవి కానట్టి చెయ్దముల్ ♦ గలవె భువిని ?

కాని నాకొక సందియము మాత్రము కలుగుచున్నయది. ఒక వేళ నీ కపటోపాయంబున విజయమొందినను ఎన్నడైనఁ దుశ్చరాలగు నీ కళావతిచే మోసమంతయు వెల్లడియైన నాబ్రతు కపుడేమి కావలెను. ఇంతకాలమునుండి సేవించుచున్న సరోజముఖ యెడలనే ద్రోహామొనర్ప సంకల్పించెనే ! రేపు నాస్థితిమాత్ర మట్లుగాఁగూడదా? కానిమ్ము. కార్యసాఫల్యమొందిన పిదప నెట్లైననిగూఢ విధంబున దీనినంత మొందించినచో భూమ్యాకాశములమధ్య నారహస్య మెరింగిన వారెవ్వరుండరు. కంటకముఁ గంటకముచేతనే నూడ బెరుకవలయు. సరే సంకేతస్థలమున నాకై వేచియుండు విక్రమసేనుని కడ కేగెదఁగాక.

(నిష్క్రమించును.)

---





# సరోజమంజరీ.

## చతుర్థాంకము.

రంగము:—విదర్భాపురరాజవీధి.

[ ప్రవేశము:—రాగవల్లరి ]

అబ్బబ్బా ! యీ కాపురము గాలిపోను యెంత పాడుదినమున యడుగు బెట్టితినో గాని యింతవరకు నగచాట్ల బ్రతుకే యయ్యెను. బొట్టు కాటుక బెట్టుకొని నాలుగునగలు ధరించుకొని కలకలలాడుతూ దిరుగుటకు నోచుకొనక పోతిని. యీ నిర్భాగ్యపు మగనికి అంట గట్టుట కామాయబ్రహ్మదేవున కేమిరాళ్ళ పూజచేసితినో నాకు తెలియదు. లోకములో నాడువారందరు తళతళలాడుతూ కిలకిలలాడుతూ ముద్దుముచ్చటలతో యిష్టాగోష్ఠిగా సంచరించు చుండ నాకీగతి యేమిటి కాల్చుకొని తిను—

భ్రమరిక (ప్రవేశించి) రాగవల్లరీ ! నీగతి క్షేమే ?

రాగ:—ఈపాడుసంబంధమే నా తలిదండ్రుల కంట కగపడవలెనా ?

భ్రమ:—ఏమే ! రాగవల్లరీ ! పిలిచినను పలుకకుండ మాట్లాడుకొను చున్నావు

రాగ:—భ్రమరీ ! ఎప్పుడు వచ్చితివే నిన్ను జూడనేలేదు.

భ్రమ:—నీయాలోచనల నడుమ గనబడలేదు.

రాగ:- న్యాయాలోచన లింతలో యణగునవా ? నే నున్నంతవరకు నుండునవే ?

భ్రమ:-ఏమే! అంతకష్టముగా మాట్లాడు చున్నావు.

రాగ:-నాకష్టములు జెప్పుకొన్న దీరునవికావు.

భ్రమ:-కాకపోయినను విందును చెప్పవే?

రాగ:-నాల్గురోజుల క్రిందట మా మెనత్త కుమారుడు చూచిపోవుటకు వచ్చెను

భ్రమ:-వచ్చి రంభవంటి నిన్ను జూచి యేమైనా అనెనా యేమి.

రాగ:-అతఁడటువంటివాడు కాడు.

భ్రమ:-అయిన నీయేడుపేమి.

రాగ:-ఏమో రాక రాక వచ్చిన చుట్టముగదా యని సంతోషముగా తల దువ్వుకొని బొట్టు బెట్టుకొని కాటుక బెట్టుకొని చెంపన చేయి బెట్టుకొని

భ్రమ:-(నవ్వుచు) ఓసి! నీ తెలివి గాలిపోను చుట్టము వచ్చెనని సొగసు జేసికొని కూర్చుందురటే?

రాగ:-కూర్చుండక యేమి జేయుమనెదవు.

భ్రమ:-వంట.

రాగ:-యేమీ ! నేనెల్లు జేయుదును. నన్నింత యలమటఁ బెట్టఁగా వంట జేయలేడా యేమి?

భ్రమ:-నీమగడంత నిర్విచారముగా కొట్టినాడటే ?

రాగ:-కాదు అనెను.

భ్రమ:-(నవ్వుచు) పాపము యెంతకష్టపు కాపురము జేయుచుంటివే. నీవుగావ ఋన్నాళ్ళుల్లేయుంటివి గాని వేరొకతె యైన నీవర

కేదో యొక త్రోవ జూచుకొనకుందునా ? సరేగాని యిప్పు డెక్కడికి బోవుచుంటివి ?

రాగ: కంసాలి కామయ్య యింటికి

భ్రమ:-అతఁడేమి చేయును?

రాగ:-ఏదోనమ్మ జ్ఞాపకమునకు రావడములేదు. అదేదో వశ్యము మందు యిచ్చునఁట గాదా !

భ్రమ:-దానినేమిచేయుదువు ?

రాగ:-అది భర్తకిచ్చినయెడల చచ్చినట్లు చెప్పుక్రింది తేలువలె నణగి మణగి యుండునట !

భ్రమ:-ఓసీ! పురుషులను వశ్యము చేసుకొను మందటే ?

రాగ:- ఆఁ అదేకాఁబోలు ! మొన్నమన కంకేళిక తన యుప భర్తకీప్రయోగమే చేసినదఁట ! అప్పటినుండి రోసరోస లాడుచుండువాఁడట్టే బుద్ధితిరిగి టక్కుమని దానిచేతిలోని కీలుబొమ్మగా మారెనట !

భ్రమ:-సరే ! ఇఁకఁబోనక్కఱ. లేదు. వెనుకకు నడువు కామయ్య గ్రామములో లేఁడు. నాలుగు రోజుల క్రిందట మామగారి యూరికిఁ బోయినాఁడని నిన్ననే కంకేళిక సారసికతో జెప్పు చుండగా వింటినని మదనిక నాకుఁ దెలిపినది.

రాగ:-ఏమి పనిమీఁదఁ బోయెనో?

భ్రమ:-అతనికి మాత్రము గతియేడ్చినది ? ఆయన బ్రతుకంత కంటె నధ్వాన్నముగ నున్నది.

రాగ:-అదేమే ! అట్లనెదవు ?

భ్రమ:-తనభార్య పుట్టినింటికిఁ బోయి నెలరోజు లైనదఁట! అక్కడ నెవరితోనో లేచిపోయిన దని వర్తమానము తెలియగానే

పాటయు నిజస్థితిం గనుగొనజాలక చెప్పినాఁడు.

రాగ:—అయ్యో ! వాడిమందు మన్నుగాను. ఇతరుల కిచ్చినట్లుము మందు స్వంతపెండ్లామున కేల నివ్వలేక పోయెనో ? వాని తమ్ముఁడైన నింటిలో నుండునా ?

భ్ర—? 

రాగ:—ఇంత విసమైనఁ దెచ్చుకొంటిమిది.

భ్రమ:—విషము నీభర్తకుఁ బెట్టెదవా ?

రాగ:—నేనంత తెలివిలేని దానను గాను. అతనికి బెట్టిన. రేపే నన్ను వీథి నంతును. అట్లేల జేయవలె నేనే తిందును.

భ్రమ:—ఓసీ ! నీసాహాసము మండిపోను. చచ్చి నీవేమిసాధింతువే బ్రతికి యుండుటచేతనే గదా కళావతి తనపంతము నెగ్గించుకొనినది.

రాగ:—ఏమే ! భ్రమరికా ! వింతగా జెప్పుచున్నావు. కళావతి యేమి జేసినదే ?

భ్రమ:—చేయుట కేమున్నది. మన కళావతి రాణితో కలహించి పోవుట నీకు దెలియునుగా ?

రాగ:—ఆ. తెలియును.

భ్రమ:—కొన్నిదినములకు మరల రాణిగారి కొలువున కేమియు నెరుగని దానివలె జేరెను.

రాగ:—అంతపోట్లాడి పోయిన దాని నాస్యమునకు దేవి మరల నెట్లొప్పుకొనియెను.

భ్రమ:—సరోజముఖి మిక్కిలి యమాయకురాలు. అందుచేతనే యెప్పటివలె గట్టినమ్మకముతో దాని నుంచుకొని యున్నటి దినము తలనొప్పి వచ్చినదని మాయజేసిన దీనినింటి దగ్గర నేయుంచి

ప్రభువుగారు రాణిగారు విచారములో నుండగా కాళీపూజకాలయమున కేగెను.

రాగ:- తరువాత ?

భ్రమ:- (ఆలకించి) ఆగుమాగుము. ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. గోడలకు చెవులుండును. యీయాలోచన మెవ్వరైన వినిన నడుమ నీతలయు నాతలయు నూడును.

రాగ: నీభయమే నీకిట్లు వినుపించుచున్నది గాని యెవ్వరును లేరు. తరువాత నేమి జేసినదో జెప్పు.

భ్రమ:- చేయవలసినదే చేసినది. దేవీపూజ జేసి దేవిగారు వచ్చుచుండ త్రోవలో వారి గమనమును వర్షధూమాలస్యము జేయించెను. ఇదే సందని మదనకళావతి రాజుగా రుద్రగణునికి బోవుచు తనకు మారుగా జూచుకొమ్మని యిచ్చిన ముల బాకును ముద్దుటుంగరమును దొంగిలించి యొకచో దాచి వారువచ్చుట చోదనే నారోగ మెక్కువగుచున్నది. ఇచట నేనుండలేను. ఇంటికి బోయెదనని చెప్పి యా రెంటిని బుచ్చుకొని బయలుపడెను.

రాగ:- ఓసీ! దొంగముండ! ఎంతపని చేసినావే? ఆవస్తువులతో దానికేమి పనికలదు?

భ్రమ:- ఏమో! ఎవరెరుగుదురు?

రాగ:- భ్రమరికా! ఇప్పుడు నీవెక్కడికి పోవుచుంటివి?

భ్రమ:- అయ్యో! మరచితి. దేవిగారి కాళీపూజనిమిత్తము పువ్వులకు బోవుచు ద్రోవలో నీమాయమాటలచే నిక్కడనే యుంటిని.

రాగ:- అట్లయిన దొందరగ బొమ్ము. మరల సాయంకాలమున నీతో గలిసి పైవిషయములు తెలిసికొనెద.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

రంగము:—విదర్భాపురములోని యంతఃపుర ప్రాంగణము.

[ మహామంత్రియగు భానుమంతుఁడు ప్రవేశము. ]

భాను:—(తనలో) సహమంత్రులగు నయవిశారదులు విశ్వసించుచున్నారు. నిజముగ వారు సందేహించునట్లు నేపుట్టలో నేపాముండునో? సరోజముఖ నిష్కళంక చరిత్రయే యైనచో భర్తకీ దుర్మరణ యోగమేల? ఐనను నామానసము మాత్రము సందియపు టుయ్యాలలనుండి యూగుచున్నది. ఛీ! ఆ మానవతికిఁ గళంక మాపాదించుట యగ్నికి చదలు పట్టినదని చెప్పుటయె.

మరచితి. ప్రియవస్తుహరణ విషయమై కతిపయ దినంబుల క్రిందట నేగదా సరోజముఖ నాకు వర్తమాన మంపెను. చౌర్యానంతరము కళావతి గోచరించుట లేదని దాసికలు చెప్పుచున్నారు. ఆమాయలాడియే యిన్ని విపత్తులకుఁ గారణభూతురాలని నానమ్మకము. ఆహా! చనుఁబాలు ద్రాగి తల్లిరొమ్ము గ్రుద్దు దుష్టురాండ్రీ పరిచారికలు. పరిస్థితు లెంత వికల్పమొందెను! ప్రతాపార్కుఁ డస్తమించినది మొదలు రాజ్యతంత్రనిర్వహణ మంతయు పైనిడికొని కన్నబిడ్డలవలెఁ జూచుచుండ కష్టములన్న నెట్టివో యెరుగని ంబానవీన రాజదంపతుల కెంతటో నెట్టి విపత్తులు సంభవించె! అక్కటా! హృదయదారణ మగు నీకతినవార్తను సరోజముఖతో నెట్లు చెప్పగలను?

గీ॥ నుడివినంతన మడియు నీ ♦ పడతిమిన్న
నుడువ కుండినఁ గార్యంబు ♦ గడువకున్న!
యెందుఁ బాల్పోదు మానసం ♦ బెంచిచూడ
ముందు గోయి వెనుక నూయి ♦ చందమయ్యె

కానిమ్ము! యెట్లైనను జెప్పియే తీరవలెను.

[ ప్రవేశము కంచుకి. ]

కం:—అమాత్యశేఖరా! మీ యానతిచ్చి నటుల తమరాకను దేవిగారికి విన్నవింప "పితృసమానులగు వారికిని నభ్యంతరమా" యని చెప్పిరి.

భాను:—సరె! అంతఃపురమునకు దారి.

( ఇద్దరు నిష్క్రమింతురు. )

రంగము:—అంతఃపురము.

[ సరోజముఖి రాజముఖులు ప్రవేశింతురు. ]

సరో:—చెలీ! రాజముఖీ! ప్రధానామాత్యుని యాగమనమునకై కారణమేమై యుండును?

రాజ:—అమ్మా! దొంగ సొత్తుకూతురగు కళావతి వస్తుద్వయముతో పట్టుబడి యుండునని నాతలంపు.

సరో:—అట్లయిన విశ్చయముగా నింతపని కళావతియే చేసినద నెదవా?

రాజ:—దేవీ! సందియమేల?

కం॥ అనుమానం బేటికి నా
యనృతోదరి కపటలీల ♦ లరయుట లేదే?
వినవే ముంజేకంకణ
మున కద్దంబేల ననుచు ♦ పుల్లాబ్జముఖీ!

కం॥ స్వాంతమున నొండు కృత్యం
బాతయు వేరొండు నుడువు ♦ నదియొండుగ నా
వంతయు లేదు నిజం బా
ద్యంతం బీగతియె చెలియు ♦ దంతము దేవీ.

సరో:—పోనిమ్ము. అదియే ప్రముచ్చలించె ననుకొందము. ఉంగరము మ్రింగుటకా? కత్తికంఠచ్ఛేదమునకా? ఎందున కక్కరకు వచ్చును?

రాజ:—సత్యము. అమోఘ వచనులరగు మీనోట నసత్యములు వెలువడునా? వానితో దానికంత పనియే జరిగితీరును.

సరో:—(కుడికన్నదరుట నభినయించి) అక్కటా! దక్షిణనేత్రభుజంబు లదరు చున్నయవి.

ఉ॥ శౌర్యరమానుషంగగుణ ♦ సాగరుఁ డీశుఁడు రాక యుంటయుఁ
వార్యముగాక దుష్టమగు ♦ స్వప్నము నంతిపురంబులోని యా
చౌర్యము సెంచగా నకట ♦ సారము చెప్పుచు మానసం బహో
పర్యవసాన మెట్లొగదె ♦ పాపవిదారణ! చక్రధారణా! ॥

రాజ:—దేవీ! విచారమునకుఁ జోటీయకుము. ఆపత్సమయము లందు ధృతివహించుట యుక్తముగాని యారాటక మనస్తాపము నొందిన తొలఁగునా? అదే మంత్రిగారు విచ్చేసిరి.

(భానుమంతుఁడు ప్రవేశించును.)

సరో:—ప్రధానశేఖరుల కీదీనురా లభివాదనములు సేయుచున్నది. ఈయాసన మలంకరింపుఁడు.

భాను:—దీర్ఘసుమంగలివి కమ్ము! అమ్మా సరోజముఖీ! ధిక్కృతరాజమండలుండగు ప్రభాకరుకరగ్రహణంబున బెంపొందు నీవు అతి దీనురాల వనుకొనుటకుఁ గారణం బెయ్యది?

రాజ:—కారణము లేకేమి? కొలది దినముల క్రిందటగాంచిన దుస్స్వప్నముచే గలిగిన తాపమును నడుమ నీప్రియవస్తుహరణము ద్విగుణము గావించెను.

# చతుర్థాంకము

సరో:—మంత్రిసత్తమా !

ఉ॥ ఎంచఁగ జీవితేశ్వరుఁడిఁక ♦ కొమ్మ దినంబులు కిందు వచ్చునో,
మించిన ప్రేమఁ జూచుకొను ♦ మేలిమి కత్తియు నుంగరంబు నే
వంచకు చేత జిక్కెనో కృ ♦ పామహితాత్మక! చారబృందముల్
బంచి విచారణల్ సలిపి ♦ నాఁడవొ, లేదొ ఝుర్ఘంగ జెప్పవే!

భాను:—(తనలో) అయ్యో! యిప్పుడేమని ప్రత్యుత్తరమిత్తును. సత్యమును వెల్లడించిన ధూర్తకృతావలంబలతికవలె నీయువతి నేలం గూలకమానునే? కావున (ప్రకాశముగా) అమ్మా! సరోజముఖీ! ఈదౌంగతన మెవ్వరి వలన జరిగియుండునని విచారింప నక్కఱ లేదు.

ఉ॥ ఎవ్వతె ప్రాణతుల్యయని ♦ యెంచుచు నెల్లస్వతంత్రమిచ్చి; బల్
క్రొవ్వున లోకముల్ దెగడు ♦ కోపుఘటించితొ వైరితల్లి! యా
జవ్వని నీకళావతియె ♦ చాలును నెంత కుచేష్టకైన; గా
కెవ్వరు నింతఘోరమున ♦ కేర్పడఁ జాలెదు వార లక్కటా!

సరో:— యేమీ ! ఆశ్చర్యము. కర్ణాకర్ణిగా వినియు నమ్మకుంటి! కను బ్రామి యీతపని నదియే చేసెనా ?

రాజ:—ఆవిషయము నేనీవరకే చెప్పియుంటిని. కాని వానివలన దాని కయ్యెడు ప్రయోజనమేమియో తెలియకున్నది.

భాను:—ప్రయోజనమనియే యానీచురాలిట్లితరులకు లోబడి తన్నేలినవారి కష్టముల కిష్టపడినది.

సరో:— ఇతరుఁడెవఁడు?

భాను:—లాటదేశాధీశ్వరుండగు రజనీచరుఁడు.

సరో:—వానికి మాత్రమవి యెందులకు ?

భాను:—శపథపూర్ణమునకు

సరో:—కట్టా! శపధమిమని?

భాను:—సతీతిలకమ వగునిన్ను మోసపుత్తునని

రాజు:-ఔరా! నికృష్టుఁడా! సాధ్యమనియే తుచ్ఛకార్యమున కిచ్చగిం చితివా?

సరో:-తండ్రీ ! భానుమంతా ! నా కర్థమగుటలేదు. సర్వము నీకుఁ దెలిసియుండిన—

భాను:—విక్రమార్కుం డొక్క-దినంబున పూర్వకాలపు సీతాది మహా పతివ్రతల వంటి సతు లీకాలమున నుందురా యని సభలో ప్రశ్నించెను.

మ॥ అనినన్ లేరని లాటరాజనగ నా ♦ హా ! యుండి రీకాలమే
రన నేలా ? కనుఁడస్మదీయసతి నం ♦ చాడంగ నీభర్తన్, దు
ర్జనుఁడా తం డపు డట్టులైన నిఁకనీ ♦ సాధ్వీన్ పరీభూతగా ...
గను నే జేసెదఁ జేయకున్న నపుడే ♦ ఖండింపు మచ్ఛీర్షమున్॥

అని ప్రతిజ్ఞ చేసెను. దానికి ప్రభాకరుఁడు సమ్మతించి తనో్ డించిన తన యుత్తమాంగం బిత్తుననియె.

రాజు:—సరే! పిమ్మట.

భాను:—కొంతకాలమేగిన పిదప మగుడ సార్వభౌముని పేరోలగ మున కేగి యందరిమ్రోల నిలచి సఫలీకృత మనోరథుండనైతి నని చెప్పెను.

సరో:—ప్రధాన శేఖరా ! వారల నెట్లు నమ్మించెను?

భాను:—రాజమందిర పురోభాగమునఁ దాను స్వారివెడలుచుండ గాం చి మోహావేశంబున కళావతిచే నీవు వర్తమానమంపితి వని యుఁ, దా నెన్ని విధముల నీతులు చెప్పి పంపినను వినమి నట్టి కేలకు బలవంతముగ నంగీకరించి కొన్ని దినంబులు నీతో— అకటా! చెప్పఁజాల.

సగో:—ఔరా! మానినీమానహరణమార్గచరా! రజనీచరా! నీనామమైన నెరుంగని యబల నారడి పుచ్చుట కెట్లునోరాడెనురా? భానుమంతా! యింతమాత్రముతో నానికృష్టుని దుష్టాలాపంబుల నాథాదులు నమ్మిరా?

భాను:—కోలుత నంతఃపురమందిర స్థిత ప్రత్యలంకార వర్ణనాకైతవమున రాజమండలమును నమ్మింపఁ జూచెను గాని యిట్టివి పరిచారికలచే వినియుండ కూడదా? ఇంతమాత్రమున విశ్వసించుట కవకాశము లేదని సార్వభౌముఁడు వాక్రుచ్చెను.

రాజ:—రజనీచరున కంతతో వాగ్బాధనమై యుండును.

భాను:—తదుపరి నాతండు నావాక్యముల కాధార మేమని యడిగెదరేమో! నేను వచ్చునపుడు మోహాతిరేకంబున సరోజముఖి తన భర్తఁ బ్రేమంబున తనకిచ్చిన వస్తువుల నాకొసంగెఁ జూడుఁడని మనకళావతీ కృపాకటాక్షలబ్ధిర వాలాంగుళీయకంబుల నాపేరోలగంబున నునిచి దానికి సహాయము ... త-లాం-ఛ-నం-బుఁ దెలుప—తుట్టతుదకు ... నీనాథుండు సైతము విశ్వసింపక తీరదయ్యె.

సగో:—హా!

శా॥ ఏమేమీ! నిజనూచు నాథుఁడౌద నా ♦ తె...గా నిచమా
యీమేనేటికి నెందుఁజొత్తు? గృపన ♦ నీక్షింపకుచుఁ బ్రోచు నా
భూమీశుం డెడమైన దిక్కెవరయో ♦ భూతేశ! నా... లే
దా! మేనీగెద పావకార్పితవిధి ♦ వ్యాపారపారీణతన్.

చ॥ తరణిని శాపతుల్ నిజప ♦ థంబుల దప్పిరొ భూతపంచకం
బరయరొ వేదముల్ దహన ♦ మయ్యెనొ ధర్మమిలన్ నశించెనో
శరనిధులెల్ల నింకెను కృ ♦ శానుఁడు చల్లదనంబు దాల్చెనో
పరమపరాత్పరుండు భగ ♦ వంతుఁడు లేఁడొ తలంచి చూడఁగన్

కాపా:—దేవీ ! తొందరపడకుము. వివాహకాలకారః మహాప్రభువసత్ ప్రభుమారతలం జేమనియును సమగ్రముగా చెప్పుచున్నా.

సరో:—అయ్యో ! యింకను వ్రతకమా! నాధుండే యగునః యంగీకరించిన వారేమందురో?

భోను:—అనుటకు నీవస్త్రపులే యడ్డుపడెను. ప్రతిజ్ఞాపూర్తికి ప్రారంభిం నతిప్రయాసమున నొక్కమాసము విశ్రాంతికి దీసికొని

మ॥ అతిదీనుండరు సర్వసంగమపరి ♦ త్యాగంబు గావించి వే
యతిరూపంబున వల్కలాజినము లిం ♦ పారగ కటిగ దాల్చి వా
గతి యేభూమియు దీనమానవుల కా ♦ కాశిగ ప్రవేశించె; వా
కృతి కైనగ కడు కాలకర్మముల నీ ♦ కగ వచ్చునే యక్కటా !

సరో:—హా! ప్రాణేశ్వరా! సర్వసర్వంసహాధీశ్వరుండవగు నీకా యిట్టి రూపంబు ప్రాప్తించుట.

సీ॥ మృదులాంబరంబుల ♦ కొదవిన నీకటి
కా! యొంచ నజినవ ♦ ల్కలము లధిప
రత్నహారాళి కే ♦ ర్పడినట్టి నీకంఠ
మునకు! రుద్రాక్షపే ♦ ర్లనఘరూప !
చందనచర్చని ♦ పొందెడు నీమేను
నకు! భూతిపూతలు ♦ ప్రకటతేజ
ఖడ్గదీపితమౌచు ♦ గనుపట్టు నీహస్త
మునకు! దండభరణ ♦ మినకులేశ !

గీ॥ సంపదలబాసి భూమిపా ♦ లింపరోసి
భృత్యులనుడించి సతిని ప ♦ రిత్యజించి
పూని యతిరూపమున నిట్లు ♦ పోవనీకు
నకట ! మానస మెట్లొర్చె ♦ నవనినాథ! ॥

## చ తు ర్థాం క ము

రాజ:—దేవీ! యూరడిల్లుము! విశ్వాసదర్పణానంతర మింటికి రాకుండున

భాను:—అయ్యో ! యింక నదియు గూడనా ! ప్రతిజ్ఞాపూర్ణము

కుజ్జయినికే పోవుదు.

సరో:—హా! ఆ ఆశయు తీరినది.

ఉ॥ హా! గుణవారిరాశిసమ ♦ హా! జితమన్మథరూప వైభవా !

హా! గురుతుల్యబుద్ధి నుత ♦ హా! రవికోటి సమానతేజ ! వే

వేగమ వచ్చి నా హృదయ ♦ వేదన బాపుమటంచు నుంటిగా

నీగతి వాఁడవాడువని ♦యెన్నడు నెంచక పోతినయ్యయో !

సీ॥ నాప్రాణధనమని ♦ నమ్మిననామీది

నిందల కపుడెంత ♦ గుందినావొ

కఠినుఁ డాతఁడు నాతి ♦ నైకొంటి ననుపల్కు-

పలుకుల కపుడెంత ♦ నులికినావొ

పలువురలో దల ♦ వంపులౌ నపకీర్తి

వచ్చెనే యని యెంత ♦ వగచినావొ

వంత మిట్లయ్యెనే ♦ యింతలో నను వారి

నొంచలే కెంతమ్మ ♦ లించినావొ

గీ॥ మించి నన్నెంచి యెంతకో ♦ పించినావొ

గాసిచే ప్రాణముల నెంగ ♦ రోసినావొ

దిక్కుదోచక యెందెందు ♦ దిరిగినావొ

యెడ నున్నావొ యేవాడ ♦ గుఁడినావొ ॥

భాను:—తల్లీ! యూరడిల్లుము !

రాజ:—స్వామీ! యీవార్త నింతకాల మెవ్వరికిఁ దెలియకుండ దాచు

భాను:—రాజముఖీ ! నేనును అంతఃపుర చౌర్యము నాలకించినది మొదలు మనంబు మనంబున లేక యుజ్జయినికిఁ జారులనంపి వారివలన నిన్నటి సాయంకాలమున కీవార్తఁ దెలిసికొంటిని. ఇప్పటికే యీ దుర్యశాగ్ని ప్రపంచమున నింటింట నంటుకొనినదఁట.

రాజ:—అకటా! ఎంత యపకీర్తిపాలయితిని.

సీ॥ ప్రత్యహంబును నాథు ♦ పాదసేవలె గాని
చెడుగు కార్యములొండు ♦ చేసియెఱుఁగ
ముదముతో ప్రాణేశు ♦ ముఖదర్శనమె కాని
కలనైన నన్యము ♦ గాంచియెఱుఁగ
నయభయంబుల విభు ♦ నామస్మరణెగాని
చిత్తమందున నన్య ♦ చింతలెఱుఁగ
గడఁగి నాకాంతుని ♦ గాథలెంచుటె గాని
మఱచియైనను వేరు ♦ మాటలెఱుఁగ

గీ॥ నన్మృత వాక్యంబు లెన్నఁడు ♦ నాడియెఱుఁగ
ధర్మమార్గంబులను ద్రోవ ♦ దప్పియెఱుఁగ
దయితుఁ కన్నను వేరొక్క ♦ దైవమెఱుఁగ
నిట్టి నామీఁద నీనింద ♦ బుట్టుటెటుఁగ ॥

తండ్రీ భానుమంతా! యీనీచ జన్మంబు వలన నిర్మలతర వంశంబులకుఁ గళంకము తెచ్చితి. శౌర్యాలంకారులగు పితృసోదరులకు దలవంపులు సంఘటించితిని. పతివ్రతయని పరిపూర్ణముగా నమ్మిన భర్తగారి కకాలమరణముఁ గూర్చితిని. పుట్టినింటికిని మెట్టినింటికిని మచ్చఁదెచ్చిననావంటి దురాత్మురాలి జీవనము ధరణికి భారము. బంధువులకుఁ దేలిక! లోకంబునకు వెక్కసము! హా! దైవమా తుదకు నన్నింతటి దుస్థితికిఁ దెచ్చితివి !

భాను:—అమ్మా! సరోజముఖి! కాల మవిలంఘనీయ మనుట సర్వజ్ఞ వగు నీకుఁ దెలియదా? కాలచక్రము నాప నెంతవారికిని సాధ్యముకాదు. దాని ప్రభావముననే పుణ్యము పాపముగాను పాపము పుణ్యముగాను సత్య, మసత్యము గాను నసత్యము సత్యముగాను వికల్ప మొందు చుండును. సుఖదుఃఖ ములకు మోదఖేదంబులఁ జూపక యీ ప్రపంచమంతయు మాయానాటక సూత్రధారియగు నీశ్వరుని లీలా నృత్యాంక రంగ స్థలంబుగా జూచిన మనమందఱి పాత్రంబులుగాఁ దోఁప కుండుమా? జగంబున స్థిరపదార్థమేమియు లేదు. దానికే శాశ్వతనామము లేనప్పుడు నింక నీనిమాట వేరుగ జెప్పవల యునా? హరిహయాదినిర్జరులును కాలకృతకర్మబంధంబులఁ ద్రెంపుకొనజాలక కష్టపరంపరలకు లోనుగావలసినవారైరి.

సావిత్ర్యాది సతీమణులు క్లేశములనొందియుఁ దుదకు సౌఖ్యాంబురాశి నోలలాడిరి. ఎంతవారికిని జన్మాంతరకృత కర్మానుభవంబును దప్పింప నసాధ్యంబు. కోరకయే కీడు మేలుల నొడఁగూర్చు భగవానునిపై భారముంచి నిశ్చలహృద యమున నుండుట మీవంటి ధీరమానసలకుఁ దగును గాని యూరక వాపోయిన కర్తవ్యాంశమున కవకాశ ముండునా?

సరో:—అక్కటా! యిఁక కర్తవ్యమేమున్నది?

చ॥ మునుపటి జన్మమందునను ♦ ముందునుగానక పాపకార్యముల్
గొనకొని యేను జేసితినొ ♦ క్రూరతఁ దత్ఫల మిప్పు డిట్లుగా
ననుభవనీయమై యలమె ♦ నక్కట! యీదృశకష్ట వార్ధిలో
మునిగెదు నాకు త్రాతలగు ♦ పుణ్యులి కెట్టులు దోఁతురక్కటా!

(మూర్ఛిల్లును.)

భాను:—అయ్యో! దేవి మూర్ఛమునింగినది. రాజముఖీ! యింతటి విప త్సముద్రమున నోలలాడు నీమ మానసంబున కెట్లు శాంతి కల్గును. పాణిగ్రహణ కాలమాది భర్త సన్నిధి ననవరాయక సర్వభోగముల ననుభవించుచు సంతోషంబున నెలంగు నీయ మ దుఃఖమును నీనేత్రములతో వీక్షింపజాలను. మహారాజ కథాపరిశీలనాశాలినై యరిగెద. అందనుక నీమెను రక్షించు భారము నీయందున్నది. మూర్ఛాపనయనమునకై శీతలోప చారముల నొనర్చుచుండుము. నన్నడిగిన మరల వచ్చెదనని చెప్పుము. నేనిదే పోయివచ్చెద.

(నిష్క్రమించును.)

సరో:—(లేచి) ఓరీ! పాపాత్మా! రజనీచరా!

ఉ॥ ఎన్నడు నీమనామమును ♦ నెంచియెరుంగ; త్వదీయరూపమున్
గన్నులఁ జూచియే యెరుగ ♦ కష్టుఁడ! నీమనసెట్టు లొప్పెరా
యన్నులమిన్న నన్వలచె ♦ నంచుమృషోక్తులు బల్క; నింకనీ
కున్నవిరా మహాత్యగతు ♦ లోరి! నిశాటసమానవర్తనా!

కృతాంతభటసదృశసైన్యరక్షకసాధరాజంబున కెవ్వారికిఁ దోప కుండ రాఁగల్గితివా? పతిపాదకమలములే గతియని నమ్మి జీవయాత్ర గడపు నన్ను మోహింపఁజేసితివా? ఔరా! దురాత్మా! నీపాపంబున కు మేరగలదా?

శా॥ కట్టా! సాధ్విని రచ్చబెట్టిన ఘనా ♦ ఘంబింతటన్ బోదు; నా
తిట్టుల్ తప్పవు తప్పనేర వపకీ ♦ తీవ్రప్రచ్ఛటల్; నారకం
బెట్టుల్ జేరదు జన్మజన్మలకు, పా ♦ పీ! నిండుసంసారముల్
నట్టేటన్ బడద్రోయు వారిగతులన్ ♦ చర్చింపగా నేటికిన్॥

కం॥ మును కలహించి రుషామతిఁ
జనిన కళావతి సహాయ ♦ సంపత్తిని నన్

గనికరము లేక సమయముఁ
గని కరమపనింద పాలు ♦ గావించెదురా!

ఇంతకును నానొసటి వ్రాఁత యిట్లుండ నీవేమి చేయుదువు? చెలీ! రాజముఖీ! మంత్రిగా రెక్కేగిరి?

రాజ:— మహారాజుగారి వృత్తాంతమును సంపూర్ణముగా కనుంగొను టకై సభామందిరంబున కరిగిరి.

సరో:— లోకమంతయు నెఱింగిన నాయపూర్వవృత్తాంతమునఁ దెలిసి కొనుట కింక శేషమేమున్నది. ఓ! ప్రపంచమా; నీకు నమ్మ దగినదియు నమ్మదగనిదియు లేదుగదా!

ఉ॥ కల్లయు సత్యముల్ విరివి ♦ గా గననేరవు; సత్యనిష్ఠులన్
దల్లడమంద జేయుదువు ♦ తద్దయు నీచులఁ బెద్ద జేతు; వీ
వొల్లక నంతరింపగను ♦ నూహయొనర్చినగాని; సుంతస
త్యోల్లసనంబు మాన్పుటకు ♦ నోపగ జాలవుగా ప్రపంచమా!

రాజ:— అమ్మా! వెఱ్ఱిదానివలె మాట్లాడెదవేమి? పాణిగృహీత కా లమాది నీమానసం బెఱిగిన మహారాజే నిక్కమని నమ్మినప్పుడు వార్తాశ్రవణపర్యాంతిక మగు లోక మెట్లు నమ్మకుండును?

సరో:— హా! నాప్రాణధనమా!

సీ॥ పరపురుషుల దృణ ♦ ప్రాయులుగా నెప్పు
డెంచెడు నాభావ ♦ మెఱుగవయ్యా
ప్రాణముల్ పోయిన ♦ పాడిదప్పక యుండ
నెంచిన నాదీక్ష ♦ నెఱుగవయ్యా
ఎల్లవేళలను నీ ♦ వే లోకమని యున్న
మామక చరితంబు ♦ మఱచితయ్యా?
అనరానిగాని నీ ♦ యతివఁ గూర్చి జనంబు
లాడుపల్కులవిడ ♦ నాడితయ్యా!

గీ॥ యిన్ని యెరిగియు నుంగరం ♦ బెనయుశక్తి
జూపినంతనె కూర్మిని ♦ జూరవుచ్చి
సత్య మిదియని నీమది ♦ సమ్మతిలుట
తలప నాపూర్వకృతమె కా ♦ వలయునకట !

గీ॥ నాఁడు యుద్యానవనిలోన ♦ నాడుచుండు
నాఁడు నాతోడ నిన్నీడ ♦ నాఁడనొక్క-
నాఁడు నని సల్పు శపథమీ ♦ నాఁడుమరువ
నాడుదానను నాథ ! యే ♦ మాఁడుదాన !

చం॥ నిరతము తావకీనపద ♦ నీరజసేవ లొనర్పకుండినన్
కరముల నన్నమంటనని ♦ కాలముబుచ్చుచు నుండు దానిగా
నెరిగియు క్రౌర్యమూనుటను ♦ నెంచగ నెంతటి బుద్ధిశాలికిన్
దొరయునొకొక్క-వేళను మ ♦ నోభ్రమణంబు లటంచు దోచెడున్

రాజ:—దేవీ ! సుఖ దుఃఖములు ప్రకృతిచిహ్నములు. వానిరాకపోకల కులుకుమానవులకు మనఃశ్శాంతి యెప్పటికి నున్నయని తెలిసినవారికి కలికాన్వాంశము దృష్టిగోచరమై యుండును. కావున నివిచార మొక్క-యెడ నుంచి కార్యము నెంచక మున్నే యేదేనొక యుపాయమున నీయపాయమును బాయుము.

సరో:—చెలీ ! రాజముఖి ! ఈదీనస్థితి కనుగుణముగా నొక్క-యుపాయము మాత్రము దోచుచున్నయది.

రాజ:—యేదీ !

సరో:—ఏదియనిచెప్పనేల ?

మ॥ అకటా ! దారుణదైవికోపహతినై ♦ హైన్యస్థితిన్ బొందు నా
కిఁక నెట్లబ్బు నపాయతారకమహా ♦ కృత్యంబు ; నశ్లాట నిం
దకు గా నీతను వుజ్జగించి, పతిక ♦ న్నకా ముందుగా నేగుటే
సుకరం బౌ నని నిశ్చయించితి చెలీ ♦ శోకింపగా నేటికిన్॥

రాజ:—అమ్మా! "శరీరమాద్యంఖలుధర్మసాధన"మ్మను నార్యోక్తి నెరుం గవా? ఈశరీరాధారముననే పుణ్యంబులను గాని పాపంబులను గాని సముపార్జింప సమర్థుల మగుచున్నారము. నానావిధ జంతుకోట్లును జ్ఞానవంతమగు నీమానవశరీర ధారణంబు నొం దిననే గాని వానికి ముక్తి మార్గమేర్పడదు. చచ్చెదమన్నంత నీల్గుటకు బ్రతికెద మన్నంత నిల్చుటకుస్వతంత్రులెవ్వరుగారు. చావుపుట్టుకలు భగవదధీనములు.

సగో:—అని నన్నిప్పుడేమి చేయుమనెదవు ?

రాజ:—జేయవలసిన విషయమును రహస్యాగారంబునకుం జని ఆలో చింతమురమ్ము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# సరోజముఖి.

## పంచమాంకము.

రంగము:—అరణ్యము

(ప్రవేశము:—యతిరూపమునఁ బ్రభాకరుఁడు)

ప్రభా:—ఆహా! ఈమహాగహనమునకును నాగమనమునకును అంతము లేకున్నయది. ఈవిషమారణ్యంబున నిక్కడికిఁ జేరువఱకే మహాప్రయాసమైనది. ఇంకఁగాశిం బ్రవేశించు నదెన్నఁడు? అటనుండి మగుడ నుజ్జయినికిఁ జేరున దెన్నఁడు! (పరిక్రమించి, నేటిరాత్రికి నీగోచరించు వటవృక్షంబు కడ విశ్రమించెదఁగాక. (అని వృక్షముక్రింద నాసీనుఁడై) ఔరా! ఈమహీరుహ మెంత యొప్పుచున్నయది!

ఉ॥ ఆతపతప్తమైన పథి ♦ కాళికిఁ జల్లని నీడనిచ్చుచున్
బ్రాతిగఁ దన్ను జేరు ద్విజ ♦ పాళికి నాశ్రయ మిచ్చి ప్రోచుచున్
ద్యోతితమైన దీక్షఁగుజ ♦ నుల్ దరి వర్ధిలకుండ నార్చుచున్
ఖ్యాతిని గాంచు నీవటము ♦ హా! పరికింప వదాన్య పోలికన్.

అదే తన దీర్ఘమగు నీడలచే దినాంతమును తెలియఁజేయుచున్నయది. ఆహా! ఏమి యీశోణకాంతుల రామణీయకము!

చ॥ స్థిరతగు చక్రరక్షణము ♦ సేయుచు సత్పథదూరిగాక ని
ర్భరమను మార్గవర్తియగు ♦ వాఁడు ప్రభాకరుఁ డాపదబ్ధి ము

న రహిని గాంచు రాజుపయి ♦ గంటువహించెనో నా జగంబు బో
ల్పరె జరఠారుణా తపము ♦ లర్ వసుధామము గ్రేణిసేయుచున్

చ॥ కర మనురక్తి లోనఁడను ♦ కంగ రజోవతియైన పద్మినిన్
గరముల నంటి కొల్లగొనఁ ♦ గాయము శోణిమ మూన దీని సు
స్థిరముగఁ బాపి వేగ శుచి ♦ జెందెద నంచుఁ బ్రతీచినున్న సా
గరమున దోఁగఁబోయె ననఁ ♦ గా నదె చూడ నినుండుగ్రుంకెడున్.

కం॥ ఈశానతాండవమునం
దాశానలినాక్షు లెత్తు ♦ నల దివియల సం
కాశానల రుచియన నా
కాశాన రహించె సాంధ్య ♦ కాంతులు భళిరే.

సీ॥ పూని విహంగమ ♦ శ్రేణి గూండ్లకుఁజేరెఁ
గమలమండంబుల ♦ కాంతి మారెఁ
జక్రవాకీతతి ♦ సంతాపమునఁ గూరె
గలువ పువ్వుల వింత ♦ తెలివిసేరె
ఘూకసంతానంబు ♦ కోటికల్ చేకూరె
సప్తాశ్వకాంతముల్ ♦ చల్లనారె
సత్వమృగావళి ♦ సంచారమును మీరె
భూతభేతాళముల్ ♦ ప్రీతిగేరె

గీ॥ జారతతి కూటమికి దమ ♦ సతులఁజేరెఁ
జోరపతి యాజ్ఞ భటపాళి ♦ చేరికోరె
మారుఁ డతిదుష్టగతి నమ్ము ♦ లేరినూరె
చారుగతి దిక్కులను నల్ల ♦ చాయ తేరె.

అయ్యారే! అప్పుడే కువలయానందకరుండగు చంద్రుఁ డుద
యించుచున్నాఁడు.

సీ॥ ప్రాచీదిశాంగనా ♦ ఫాలభాగమునందు
విలసిల్లు సిందూర ♦ తిలకమనఁగ
ఇంద్రాణి తనకేల ♦ హేలాగతిని దాల్చు
ప్రవిమలంబగు పద్మ ♦ రాగమనఁగ
విరహిణీ జనమనో ♦ సరసీరుహము లొంపఁ
జరతెంచు వేల్పుల ♦ కరియనంగఁ
దమమను దైత్యుల ♦ దండింప సమయారి
విక్రముండెత్తిన ♦ చక్రమనఁగ
గీ॥ తనయుఁ డరుదెంచు ననెడు సం ♦ తసముతోడఁ
గరము నుప్పొంగు జలధిరా ♦ గత్తరంగ
నిచయసంజాతధవళడిం ♦ డీరమనఁగ
నుదయ గిరిపైన నమృతాంశుఁ ♦ డుదయమయ్యె.

ఔరా! ఈతండు కైరవంబుల పాలిటి పరమబంధుండే యైనను సరోజమండంబులకు మాత్ర మధికశత్రువు. ఛీ! ఛీ! సరోజనామోచ్చారణకతంబున నాజిహ్వాంచల మపవిత్రంబు గావించితినే. (నిదానించి) అకటా! అల్లారు ముద్దుగ వాకొను నీనామమిప్పటికింత హేయత బాటించుటకుం గల కారణము నీపాంసులతా భావమే కదా! హా! సరోజముఖి!

సీ॥ కల్యాణి! నాకూర్మి ♦ గంగపాలుగఁ జేసి
యీరూపుగాంతువం ♦ చెంచనైతిఁ
దోడివారలలోనఁ ♦ గూడి యాడఁగరాని
తలవంపు తెచ్చుట ♦ తలపనైతి
మోహనాంగిరో హేయ ♦ ముగ నీలుపుతనంబు
వీగెదవంచుభా ♦ వింపనైతి
శంకరాభరణవం ♦ శమునకు మచ్చనీ
కరణిఁ దెత్తువటంచు ♦ నెరుగనైతి

గీ॥ కానఁడా నిన్ను దైవంబు ♦ కలికిమిన్న
యెట్టికార్యంబు నీవొన ♦ రించుచున్న
భైరవియుఁ బూజలను గొంచు ♦ పడతి! నీవు
చేయు దుర్వృత్తి వారింప ♦ దాయెనకట!

అహః! ఏరీతినైన నాపంతము నెగ్గుననుకొంటిగాని యింతలో నిట్లగుట తెలియనైతి. నాసరోజముఖయిట్లొనర్చునని స్వప్నమునం దైనదలంపనైతి. స్త్రీజనము నెన్నటికైననమ్మవచ్చునా? యెంత కుటిలత్వము! ఎంతసాహసము! మహారాజు భార్యయనిపించుకొని, పతివ్రతయని పేరుగాంచి తుదకిట్టి యకార్యమునకు లోబడుటయా? నాపై నెంతమోహ ముట్టిపడునట్లు నటింపుచువచ్చె! ఎంతవాక్సుధావర్షధారల గురియించుచు వచ్చె! ఆవలపుమాటలు, ఆచిరునవ్వులు, ఇచ్చకంబులని యెన్నడు నెంచనైతి. ఇంతకును నాపెననేల? లోకంబున పతివ్రతయే లేదను రజనీచరునితో నాభార్యయే పరమపతివ్రతాశిరోమణియని వేనోళ్లబాగడి సిగ్గులేక వాదించిన నన్నే యనుకొనవలయు! ఇంతటి సతీమణిని భార్యగా బడసిన నీభాగ్యమే భాగ్యమని లోకు లాడుమాటలకు సంతసించుచుంటినే! నిజముగా మా సరోజముఖ యట్టిదియే యని యెంచుచుంటినే! అకటా! అట్టి యూహ లెంతలో గగనకుసుమములయ్యె.

హా! సరోజముఖి! నీప్రభాకరు నిట్లు మోసపుత్తువే? ప్రాణేశ్వరీ! విక్రమార్కమహీపాలుఁడు పిలువనంపె పోయివత్తు నన జన్మతారకంబులైన మీపాదసరోరుహసేవలు లేక వాసరంబు లెట్లుపుత్తునను మాట లింతలో మరచితివా? నీశీలముల నే దేశమునకంపితివి. నీప్రేమరసపూరంబు నేయేట గలిపితివి!

దేవతారాధనంబుల జేయుమన్న మీరేనాకు పరమదైవములరని య నుచుందువే! ఇట్టిమాటల పీటిబుచ్చి రొయిక్కతుచ్ఛమానవుల కెట్లులో నైతివి? మారుమాటాడని ముగ్ధవే. యింతటి ప్రౌఢవాక్యంబు లెట్లు గ్రడించితివి? నరకబాధల కెట్లు లిచ్ఛగించితివి ?

అకటా! పాణిగ్రహణకాలమాది నరనిమిసమైన నెడబాసి యుండఁజాలక నన్నే దైవముగా నెంచు నాసరోజముఖియా ?—ఇట్టి నీచకార్యమున కొడిగట్టుట. అసత్య మసత్యము.

అసత్యమైన నీదృష్టాంతమున కేమన వలయు? పట్టాభిషేక సమయము మొదలు హస్తము నెడ బాయకుండు మన్నామాంకితం బగు ముద్దుటుంగరము నెట్లుకాదనవచ్చు ? మొలబాకు నెట్లుమరువ వచ్చు? ఉజ్జయినీ ప్రయాణోన్ముఖుండ నైనప్పుడు "నాథా! మీపాద కమలప్రతిపాదకముగా నేదే నొక్కచిహ్నము నొసంగిన మీచుమరల వచ్చుదనుక పూజించు కొనుచుందు"నని ప్రార్థింప నిచ్చినవికావా యవి ?

అయినను యింతమాత్రమునకే నమ్మవచ్చునా ? పాపాత్ముం డగు రజనీచరుండు సమయము దీర్చుకొనుటయే కర్తవ్యముగా నెంచి యుండెనుగాన నేదే మాయోపాయంబులచే దాసీజనంబులఁ జేపట్టి నిట్టివి సంగ్రహింపగూడదా ?

అయ్యో ! ఏమి నావెఱ్ఱితనము. ఎంతటిధైర్యశాలి)యైనన నిం దుపేరోలగంబున నింతటి యబద్ధంబుల నిరూపించుటకు సాహసింప గల్గునా. ప్రతిజ్ఞా పూర్తియందే దృష్టియుంచిన నీతఁడంతఃపురోప కంఠమున బోవుచుండ జూడరాదా?చూచి రాణివాసవ్యభిచారసహా యములు దాసిక లగుటచే పిలుచుకొని వచ్చుటకుఁ గళావతిని బంప రాదా? కావున నంతఃపురమున కరిగియే యుండవచ్చును. కతిపయ దివసంబు లచట నివసించి పోయెదనన్న, ననురాగవశంబున నెక్కడ

నో పోయినట్లు భ్రాంతి వచ్చునని నాయొక్కయంగుళీయకముల నొసంగి యుండవచ్చు. కాదేని స్త్రీయౌ-రు-గ్ర-తం-లాం-ఛ-న-ము వానికెట్లు తెలి యును. సత్యము! సత్యము! స్త్రీలమాయల నెఱుంగుటకు పర మేష్టికైన నసాధ్యమనుట సత్యము.

హా! దుర్భరము. దుర్భరము. ఎవ్వతె పరమపతివ్రత యను కొనుచుంటినో ఎవ్వతె ప్రాణతుల్యయని భావించుచుంటినో ఎవ్వ తెకు నూతయులజడి వాటిల్లినను ప్రపంచమే మునింగినట్లుజూచు చుం టినో, ఎవ్వతె మీఁదిగట్టినమ్మకముచే నింతటి ఘోరశపథ మొనరించి తినో యట్టిసాపెరోహాంపుబరణి నావలపులగని నాసరోజముఖి హా నా సరోజముఖి యన్యమానవునకు లోనయ్యెననుట నావీనులతో విని సహించి జీవంబుల నిలుపగలనా?

సరోజముఖి! నిన్నువిడచి కొంతకాల మటనేయుంటి నను కొనుము. ఇంతలోనిట్టి యకృత్యమునకా నీవు పాల్పడవలసినది. హా! దైవమా! నేను పోయినను నాకల్పాంతముగా నిలుచు నీనింద కేమిసేయుదు. మరల నాసభకెట్లుబోదు. ప్రజల మొగముల నెట్లుచూడగలుగుదు? కావున నాకీయరణ్యమధ్యంబుననే ముక్తి కాం తాపాణిగ్రహణసుఖం బొడగూర్పుము.

ప్రాణములారా! లేచిపొండు—ఆకాశమా నాపైబడుము—మృ గములారా! నన్నుభ్రమింగుడు! దుఃఖమా! తొలగిపొమ్ము—హా సరోజముఖి! సరోజముఖి!

(మూర్ఛిల్లును.)

యవనికజారును.

## ద్వితీయతరంగము.

[అరణ్యము:—సరోజముఖ ప్రవేశము.]

సరో:—

సీ॥ హా మనోనాయక ♦ హారాజమార్తాండ
కువలయపాలన ♦ కుమతిహరణ !
హాగుణభూషణ! ♦ హాకృపావారాశి!
విమలమారణకళా ♦ వినుతరూప!
హాజీవితేశ్వర! ♦ హాగర్వనిర్వాప
సర్వవిద్యాప్రౌఢ ♦ శాంతమూర్తి!
హాహృదయాధీశ! ♦ హానిత్యసత్యాఢ్య!
దిగ్భాగపూరిత ♦ దివ్యకీర్తి!
గీ॥ హా! సదావిశ్వనాథ పా ♦ దాబ్జపూజ!
హా! వనీపకసవిధ క ♦ ల్పావనిజమ!
హా! మదనసమసుందర ♦ హానుధీర!
హా! ప్రజానాథ! మామక ♦ ప్రాణనాథ! ॥

సీ॥ నాభాగ ధేయంబు ♦ నాకిడి సుకృతంబు
గడియింప రాదె యో ♦ ఖగములార!
నాపారిజాతంబు ♦ నాకిచ్చి పుణ్యంబు
గట్టికో రాదె యో ♦ గుట్టలార!
నాపెన్నిధానంబు ♦ నాకిడి యశమున
మించగా రాదె యో ♦ మృగములార !
నాదైవదైవంబు ♦ నాకొసంగి వరంబు
సాధింపరాదె యో ♦ మృగములారా!

గీ॥ నాదు సర్వస్వమగు వాని ♦ నాకొసంగి
దయను బ్రోవంగ రాదె భూ ♦ తంబులార!
నాదు నోములపంటను ♦ నాకునిచ్చి
మనుపరే నన్నుఁ గృపజూచి ♦ మానులార!

సీ॥ రాకాసుధాకరు ♦ జోకమీరఁగఁ జాలు
నగుమోము చెలువునఁ ♦ దగువానిఁ
దామరసంబుల ♦ గోమును బోకార్చ
గల చేదోయి క ♦ న్గవలవానిఁ
బదియారువన్నియ ♦ పసిడి కాంతుల దేరు
మైచాయ జిగిచేల ♦ మలయువాని
బిసకాండముల పొందు ♦ గసిమసంగఁగఁ జాలు
నురుతరాజాను బా ♦ హువులవాని

గీ॥ డంబు మీరెడు పీనవ ♦ క్షంబువాని
లలితవర్తులకంబు గ ♦ ళంబువాని
పరమ మునివేష ధారియై ♦ పరగువాని
నరయరే మీర లిక్కాన నరుగువాని

అకారణజనిత క్రోధావేశంబున నీ యరణ్యమధ్యంబున నా యార్తధ్వని నాలకించువారెవ్వరుందురు? రక్షించుమని ప్రార్థించుట కన్న భక్షింపుఁడని యడుగుటయే సుకరము. అయ్యో! ఈ నిర్భాగ్యురాలి కామాత్రపు బుణ్యమేయున్నఁ గరుణారహితంబులగు నీ క్రూరసత్త్వంబులు సైత మన్నేలఁబరుగిడును?

సీ॥ నావంకఁ జూచుచు ♦ నేవంకకో పోయె
దేలరారమ్ము శా ♦ ర్దూలరాయ!
పిలుచుచుండఁగఁ బోవ ♦ బింకమా యిదినీకు
గరుణాశ మరలుమో ♦ గవయపుంగవ

ఆహారవాంఛ నీ ♦ కడుపుకు బెట్టిన యేమి
కన్నాతిచూడవు ♦ గండకంఠ
శూరత్వమహిమంబు ♦ శౌర్యకరమైన యేమి
కొట్టినఁ గినియవు ♦ కోలవరమ !

గీ॥ కనలి నాథుండు విడనాడఁ ♦ గానలందు
దిక్కు లేకయుఁ దిరుగాడు ♦ దీనసుమ్ము!
ఇట్టి యబలను గడదేర్ప ♦ నేల వెరపు?
కరములను ప్రముక్కులిడుదు వేఁ ♦ గంబరారి !

భర్తృవిసర్జనీయుంబగు నీశరీరంబుకీ మృగంబులకును నంటరాని దిగాఁ దోఁచుచున్నది. హా! ప్రాణకాంత !

చం॥ కువలయకాంతకాంతమశి ♦ కుట్టిమశాలల సంచరించుచోఁ
బ్రవిమలమైన ప్రేమ మెఱబ ♦ డాబ్జముఖ యోర్వ్వ నయంచుఁ బల్కెడి
యువతిని గూర్చి యట్టిపతి ♦ యుగ్రశిలాప్రతతుల్ పదంబులన్
దవిలినఁ గల్గు పొక్కులనుఁ ♦ దల్లడమందెడు రావె ప్రోవఁగన్॥

అక్కటా! యీనిర్భాగ్యురాలి దీనాలాపంబులు నీకర్ణమూలంబులకుఁ జేరఁగల్గునా? అంతటి భాగ్యమేయున్నఁ బిట్టపిడుగున విడనాడుటకు నీమానస మొర్చియే యుండదు. నాథా! సర్వకాలసర్వావస్థలయందు నీశ్రోఢ్యై మెలంగుకులకాంతయందుఁ శిశంకమున్నదను నమ్మకం బెట్లుగలిగె? కలిగెఁబో నీవై పరీక్షించి సత్యాసత్యంబుల నెఱుంగుట యుక్తంబుగాని యెవ్వఁడో యొకతుచ్ఛమానవుండొ డ్లనెడఁ గొన్ని యశ్లీలంబుల నాడినంత మాత్రమున నగునని సమ్మతించి ప్రాణహాని గొడంబడుట మీవంటి ధర్మాత్ములకుధర్మమగునా? అయ్యో! తప్పునాడితి. నలుపురలోఁ గర్ణశూలాయమానంబులగు నింతటి దుర్భాషల నాలకించియు మీదఁ బారుమనిలయుండవగు నీకు మనో వై కల్యంబు గలుగుట యధర్మమైన నిరూపించి నాపాపశంబును ద్విగుణీకృతం బొనర్చుచుంటి. ఇంతకు

-దూరంబున కరుగుచున్నచో మార్గమధ్యంబున నెవ్వరేని యా టవికులు గాన్పించిన యడిగి కాసారంబులం దెలిసికొని పిపా సం బాపికొన వచ్చును. ఎట్లైనను త్వరలో కాశింజేరితి మేని భక్తజనసులభుండగు విశ్వేశ్వరుని కారుణ్యంబున మన కష్టము లన్నియు నుదమ్ముట్టును పోదముపద. (తనలో) హా! కళావతీ! ఎంత విపత్తు సంఘటించితివే!

(నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము.

(అరణ్యము - సర్పదష్టయై కళావతి ప్రవేశము)

కళా:— హా! హతవిధీ! జనశూన్యంబగు నట్టడవిఁ జుట్టుపక్కంబులఁ జూడక యేలినవారికిఁ గాక యనాథనై మఱియు నీక్రూరసర్ప ము నెక్కడ గూర్చితివి. పన్నగమా! నీ కేమి పాపము చేసితి ని? నీ తెరవురాక తెరువుబట్టిపోవు నన్ను వలజడి బెట్టు నీ కెన్న టికైన నావలె నకారణమరణము రాక పోవునా! అయ్యో! రాజచంద్రా! నీదాసి నీకార్యము కడముట్టించుచుండెనని సం తసించు చుంటివి కాని యరణ్యమధ్యమున నంతమొందుచుం డుట నించుకయు నెఱుగవు గదా.

గీ॥ అకట! యేమయ్యెనో నాథుఁ ♦ డనెడు చింత,
నాదురాశయు బోలెదు ♦ నీదురాశ
యడలు వట్టుగఁ జేసి ధ్యా ♦ యడవి యందుఁ
జిక్కితిని పాపిసర్పంబు ♦ చేతనిటుల.

ఘనుఁడు దానివల్ల ఫలమేమి? ...

సీ॥ ఖిన్నకర్మములకు ♦ నెన్నఁగఁ గాఁగతం
దగు నిన్నటిప్పట్ల ♦ వగఁగవలయు
పరయఁ బరస్పర ♦ మహా ప్రేమలతికల
నలము దాంపత్యంబు ♦ నట్లుచేసి
కడుపారఁ దిని తొంద ♦ గన్నతుంగక సుఖ
యించు నట్టి మాయల ♦ నిటులొనర్చి
ముందేమిరో కొంత ♦ మూటగట్టుకొనంగ
దలచు నీపాపిష్ఠి ♦ తలఁపుకలన
గీ॥ బరము చెడనాడి యిహమునఁ ♦ బరమదుఃఖ
మొందఁదగు వాఁడవై తూలు ♦ మందబుద్ధి
వైతి వెన్నటికైన నీ ♦ నీతిలేక
చేయు పాపంబెటో బయల్ ♦ చేరదయ్య!

తల్లీ! సరోజముఖి! చిరకాలమునుండి నీయింటఁ గట్టుటకుఁ బెట్టుటకు దలుగులేక సుఖముగా జీవించుచుఁ దుట్టుదుదకు ధనాశాపాశబద్ధనై నిశాపురిమున కెన్నికడగండ్లు తెచ్చిపెట్టితి అక్కటా! నా కల్మషమునకుఁ గడలేదుగదా!

(సరోజరాజముఖుల ప్రవేశము.)

సరో:— సీ॥ వదుగాన లోపలఁ ♦ గడుభీతి పడితొంతో
యడలు నీపడతుక ♦ వరయరయ్య
పతివియోగము చేతఁ ♦ మతిచెడి యతిమాన్య
గతి నొందు నీసతిఁ ♦ గావరయ్య
లోకాపవాదంబు ♦ బోకార్ప నేరక
చీకాకు పడునీవె ♦ సాకరయ్య
కన్నవారల కతి ♦ విన్నబాటొదవెనం
చన్న నీయన్నమ ♦ న్నించరయ్య

గీ॥ మిగులు వగల బాగులు ♦ మగువబాముల్ బాపి
పుణ్యగతిన్ని బోవఁ ♦ బూనగయ్య
కరుణఁ జూడరయ్య ♦ కాంతునతోఁ గూడ
జేయరయ్య వినుతి ♦ సేయుచుంటి॥

రాజ:— దేవీ! ఆచేరువ నేయువతియో కాని మనవలె నల్లాడుచున్నది. చూతము రమ్ము.

(అని సమీపింతురు.)

సరో:— కాంతా! మహారణ్యమధ్యంబున నొంటరివై వనటజెందు మంద భాగ్యురాల వగు నీవెవ్వరవు?

కళా:—(తనలో) అక్కటా! దేవి సరోజముఖి వలెనున్నది. పైనమా వీరిమొగముల నట్లుకాంతు.

రాజ:— (నిదానించిచూచి) అమ్మా! ఈమె మనకడగండ్లకు కారణ మైన కళావతియే!

సరో:— (ఆశ్చర్యముతో) కళావతీ! ఇచటి కేలవచ్చితివి?

కళా:— దేవీ! విధిప్రేరకత్వమున గాలసర్పముచే గఱచుటకు

సరో:—అట్లనెద వేల?

కళా:—అనుట కేమున్నది?

గీ॥ మించి యజ్ఞానవశతఁ గా ♦ వించునట్టి
పాపకృత్యంబులకు నగుఁ ♦ ఫలము లెటులో
యనుభవింపక విడనాడఁ ♦ నలవియగునె
యవని నెంతటి వారల ♦ కైనఁగాని.

రాజ:— (తనలో) కుటిల్ల తన పాపంబునకు నేఁటి యనుభవమున బశ్చాత్తాపమొందుచున్నయది. (ప్రకాశము) కళావతీ! కల్మషమున నెట్టిదో యెఱుంగక బతుకు నీకును గల్మషమా?

కళా:- చెలీ ! రాజముఖీ ! లోకమంతయు నాయరచేతిలోనిదే యను యహంకరణమున నీచురాలనై నిన్నన్నమాటలఁ బాటిగాఁ దీసికొనక మన్నింపఁ బ్రార్థించెద.

సరో:- సఖీ! ఇంతటి పరిదేవనమునకుఁ గారణమేమియో తెలుప వైతివి.

కళా:- తల్లీ! మహారాజ్ఞీ !

సీ॥ సత్యావతారుఁడౌ ♦ క్ష్మాపాలకుని పెంపు
దూలగాఁ దలకొట్లు ♦ పాలుచేసి
పతిసేవ లేకాని ♦ యితరంబెరుంగని
పరమసాధ్విని నింద ♦ పాలుజేసి
తరతరంబుల నుండి ♦ తలగకయుండు దా
సీదాసులన్యుల ♦ జేరఁజేసి
ఎల్లకాలము సీత ♦ డే సాకవలెనను
ప్రజల దుఃఖంబుల ♦ పాలుజేసి

గీ॥ నిత్యమగు నాదు కలిమికిఁ ♦ నీళ్ళువదలి
మారి నీకాపురమునకు ♦ మారినైతిఁ
గ్రూరమతి నైతి దిక్కేడి ♦ కూలనైతి
దుష్టభూపాల సాంగత్య ♦ దోషముననుు.

రాజు:- ఆపాతకునితో నేగినదాన విచటి కేల వచ్చితివి?

కళా:- అట్టు రజనీచరునితో నుజ్జయిని కేగిన నాలుగు దినములకు నాతఁడు "ఎక్కువకాల మిచ్చటనుండఁదగదు. నాపట్ట ణమున కరుగు" మని కొంతధనమిచ్చి పనుపవచ్చుచు నిచ్చట మార్గమధ్యమున సర్పదష్టనై—

సరో:—అయ్యో! కళావతీ! నీజీవిత మెంతలో నెట్లయినది ?

కళా:- అకటా! దేహమంతకింతకు వివశమగుచున్నయది. కన్నులు తిరిగిపోవుచున్నవి. దేవీ! ఇదే కడసారి నమస్కారము. నా తప్పులన్నియు——

సరో:-అక్కటా! ఆగరళకంఠునికృపచే నీదీనురాలి బ్రతికింప నొకవిధ వైద్యుఁడైన రాఁడాయెనే?

రాజ:-తల్లీ! ఇది విజనారణ్యము గాదా?

కళా:-కట్టా! ఇంకెక్కడి వైద్యము? ప్రాణంబులు స్థానంబులు తప్పు చున్నవి. హా! విశ్వనాథా! నాపాపంబులు గాపుము దేవీ! నాచరమకాలంబున నిన్నుఁజూచి ధన్యనైతి అయ్యో! నాలుక లాగుచున్నది. ఇంకమాటాడఁజాల. సాధ్వమణి నలయించితి—— పాపంబులు——దిక్కులేక——మరచితి——మాట——ఉత్తరము.

(కన్నులు మూయును)

[యవనిక జారును.]

తురీయ రంగము:- కాశి.

(ప్రవేశము - ప్రభాకరుఁడు.)

ప్రభా:- సంశయమేల?

గీ॥ ప్రథితశితికంఠగృహరత్న ♦ రాశి కాశి
గగనగంగాధునీసంప్ర ♦ కాశి కాశి
నతజనానేకదురిత వి ♦ నాశి కాశి
అహరహోయాత సర్వామృ ♦ తాశి కాశి

సీ॥ సమవర్తికింకర ♦ చయదుర్నిరీక్షంబు
పరమహంసలకెల్లఁ ♦ బట్టుకొమ్మ

కలుషమహాటవుల్ ♦ కాల్చెడు కార్చిచ్చు
భోగభాగ్యములకు ♦ బుట్టినిల్లు
వెకలులొ టకటాంకు ♦ లకు దుష్ప్రవేశంబు
కామితంబులనిచ్చు ♦ కల్పతరువు
జలనిధి మేఖలా ♦ గళహార తరళంబు
భక్తజనంబుల ♦ పాలిసురభి

గీ॥ ఈషణామయములకు ది ♦ వ్యౌషధంబు
భక్తిస్మరియించు జనులకు ♦ ముక్తిదంబు
సంతతము నింపు సొంపారు ♦ సంపదలకుఁ
గాపురం శార యీకాశి ♦ కాపురంబు.

కం॥ శైశవము నుండి యెన్నఁడు
కాశికి నేఁగఁగ సురాప ♦ గఁ గ్రుంకిడి వి
శ్వేశుని సేవించెద నను
నాశలతో నుంటి నేఁటి ♦ కిది లభియించెన్.

గీ॥ లలన కతమునఁ బెద్దకా ♦ లమున కిపుడు
సముచితాభీష్ట లాభసం ♦ గముఁడ నగుటఁ
గంటకావృత విపిన మా ♦ ర్గములఁ బడిన
నిరుపమక్లేశములు సౌఖ్య ♦ కరము లయ్యె.

చ॥ జలధిపరీతభూవలయ ♦ శాసనకర్తయు నైన నేమి? స
ల్లలితవదాన్యతావిభవ ♦ లాలసుఁడైనను నేమి? జన్మముల్
సలిపిన నేమి? వారణసి ♦ జాహ్నవి మజ్జనముల్ బొనర్పఁగాఁ
దలపని వాని జన్మము వృ ♦ థాయగుఁగాదె మహీతలంబునన్.

ఉ॥ నేఁటికి నాల్గునాళ్ళు చన ♦ నేనిటకున్ జనుదెంచి వేడ్కనై
పీటఁగిలట్టి దైవత ని ♦ వేశములన్ గనుచున్న నాకె నా

నాఁటికి భక్తిభావము ఘ • నంబగుచుండ నజస్రముఁ జటా
జూటునిఁ గొల్చు నీనగర • సూరిజనంబుల భాగ్యమెట్టిదో!

ఆహా! ఏకవార మజ్జనమాత్ర సకలపంక సంక్షాళన కరణ శీలిని గంగాభవాని యొతయు నేత్రానందముగ వెలుఁగుచున్నదే. (పరిక్రమించి)

కం॥ సురగరుడోరగ విద్యా
ధర ఖేచర ముఖ్య దేవ • తాతతి చేతన్
బరిచర్య లొందు దేవుని
శిరమునఁ గాఁపుంటి వేమి • చెప్పుదుఁ దల్లీ!

మ॥ జననం బచ్యుతపాదయుగ్మము; నివా • సం బీశుమూర్ధంబు; శాం
తనవుం డాత్మజుఁ డిద్ధతేజుఁడు మనో • నాథుండు రత్నాకరుం;
డనయంబున్ విహరించు మార్గములు నా • ర్యావర్తమధ్యస్థపా
వనభూముల్ జగదేకపావని నీ • భాగ్యంబు సామాన్యమే?

అదే విశ్వేశ్వరాలయము! విశ్వనాధుని సేవించి నాజన్మంబు నకు సాఫల్యమొనర్చు కొనెదఁగాక. (పరిక్రమించి)

గీ॥ జయమహాదేవ! దేవేశ! జయగిరీశ:
జయబిలేశయకృతహార! భయవిదూర!
జయసుజనమానసవిహార! శయకుఠార!
జయవృషతురంగ! ధవళాంగ! శంభులింగ!

—* దండకము. *—

దేవాదిదేవా! మహాదేవ! నీకన్న దిక్కెవ్వరో పన్నగామేయ భూషోపపన్నా! దయన్ బ్రోవుమన్నా! సదా ఘోరపాపాంబుధిన్ మున్గి వాపోవు నాపాటి చాపల్యులన్ బ్రేమమేపారఁగాఁ బారమున్ జూప నీపాటి మేటుల్ ధరన్ లేరు నాపాపముల్ బాసి లోకోపవాదం

భోక్తార్వమో సర్వలోకేశ! నాకేశ ముఖ్యామర వ్రాత శుంభత్కి-రీటస్థమాణిక్యసందీప్త పాదద్వయా! మౌనిహృద్ధ్యేయ! సంసారకూపంబునన్ దోఁగి హింసాది కర్మంబులందుం దిరంబాతుమా మానవాళిన్ గృపన్ భూరి ధన్యాత్ములన్ జేతువౌరా! మొదల్ నామ రూపంబులే లేని నిర్విణ్ణు విశ్వేశ్వరాభిఖ్యసారూప్యవై దర్శనస్పర్శ నార్చాదులన్ గల్మషంబుల్ పెడంబాపి భక్తాళికిన్ భుక్తిముక్తుల్ ప్రసాదించుచున్ బొల్చినావయ్య! నాకుయ్యి నాలించి మోహాదిపాశంబులన్ ద్రెంచి రాగంబుమాయించి మాంద్యల్ విదారించి శాంతిం దలంబాగనన్ జచ్చి యున్ బుట్టుటల్ లేని దారిన్ గటాక్షించి శాశ్వతానంద లోకంబునన్ జేర్చుమీశా! మహేశా! భవానీశ! తేజఃప్రపూర్ణాష్టకాష్ఠావకాశా! నమస్తే నమస్తే నమః॥

మ॥ ఇఁక పుజన్మము సంగానన్ మరల ని ♦ న్నీక్షింతునో లేదొ నే
రక నేఁ జేసిన కల్మషంబులను పా ♦ రం ద్రోలి చంచత్కృపా
రసకటాక్షంబులు నాపయిన్ బరపి ని ♦ త్యానందిరానందమ
త్యకలాకస్థితి నీగదయ్య! పరమే ♦ శా! దీనచింతామణీ!

(చూచి) ఆహా! ఎంత కాలాతీతమైనది! తపసి తీఁగ భుజగ భూషణుని సేవలచేఁ దన్మయుఁడనై యెఱుఁగనైతి.

ఆ॥ సమయసంబోధి తుఁడయి ♦ చరమదిశకు
నరుగు చున్నాఁడదె ప్రభా ♦ కరుఁడు, ప్రోఁక
సమయ సంబోధ తుఁడయి ♦ చరమదశకు
నరుగఁ గాచున్న యీ ప్రభా ♦ కరుపిలీల॥

ప్రతిజ్ఞయా బ్రాదము! ప్రతిపక్షియా కఠినుఁడు! ఆజ్ఞయా సార్వభౌమునిది! ఇట్టితరిఁ గాలవిలంబన మొనర్చుట పాడిగాదు. కావున రేపే యుజ్జయిని ప్రయాణోన్ముఖుఁడ నయ్యెదఁగాక.

(నిష్క్రమించును.)



శ్రీ

# సరోజముఖి.

## షష్టాంకము.

రంగము: ఉజ్జయిని రాజవీధి.

[ప్రవేశము. కాలికి కట్టుకట్టుకొని కుంటుచు రామావధానులు.]

రామా:—హరేరామ! హరేరామ! రామరామ హరేహరే!
ముండకొడుకు వీరన్నగాడు యేమర్మస్థానాన కొట్టినాడోగాని యింతవరకు కాలునొప్పి తగ్గనేలేదు.
హరేకృష్ణ హరేకృష్ణ! కృష్ణ కృష్ణ హరేహరే!

[అప్పంబొట్లు ప్రవేశించును.]

అప్పం:—ఏమండోయి రామావధానులు భావగారు! బొత్తిగా చిక్కిపోయినారు!

రామా!—అబ్బ! అబ్బ! ఎవరు? అప్పంభొట్లు. నీవషోయి. ఆ. ఏమిలేదు. ఈనుధ్య సుబ్బిశెట్టిగారింట్లో జరిగిన వివాహమునకు పోయినప్పుడు లభించిన సంభావన.

అప్పం:—అదేమి? అట్లనుచున్నారు?

రామా:—ఏమిరాని వెధవకుంకలకుగూడ భూరిసంభావన లిచ్చుచుండుటవలన పరనింద ఆత్మభూషణమెరుగని నాకు సైతమివ్వకపో

దుకాయను యాసచేత సింహద్వారమువద్ద జనసందడిచే పో వీలుగాక దొడ్డిదారినిపోయి గోడమీదినుండి గభీలుమని క్రింది కి దిగుసరికి అక్కడ యముడువలె వారిసేవకుడు వీరన్నవ— వాడిముండమోయ-ఒకసారి సంభావన తీసుకొని మరల దొడ్డి దారిని వచ్చెదవా 'బాపనయ్యా' అని—అబ్బ అబ్బ—కాలు విరుగ యేమికొట్టినాడోయి—పాపము యెందుకని—

అప్పం:—అయితే అదివరకొకసారి సంభావనదీసికొన్నమాట నిజమేనా?

రామా:—వాడేల అబద్ధమాడును?

అప్పం:—హాయిగా రాజబంధువులకు పురోహితుడవై యుండగా యీకపటసంభావనలకొరకు కాలు విరుగగొట్టించుకొనుట నీకిదేమి కర్మమయ్యా?

రామా:—నీవన్నది నిజమేనోయి! మొన్న వారింటిలో శుభకార్యము నాడు తండుల దానమంత్రమునకు బదులు పొరబాటున తద్దినమంత్రము చదివేటప్పటికి—

అప్పం:—రామరామ!

రామా:—దగ్గరనున్న వేదశాస్త్రిలు అంతమందిలో నన్నాక్షేపించి నా పురోహితత్వమునకు పూర్ణానుస్వారమిప్పించినాడు. చూచి తివా! భడవ. అప్పంభొట్లు! వాడికి నేను చేసిన ఉపకా రములకు తిరిగి యిదియా వాడుచేయవలసిన ప్రత్యుపకారము?

అప్పం:—నీవేమి యుపకారములు చేసితివి?

రామా:—ఒకటా, రెంటా? విను. వాడు చల్దియన్నముతిని వచ్చిన ప్పటికి తద్దినములకు వానితోపాటు సహభోక్తగా కూర్చునే వాడనా. వానికొడుకుకుంకలకు ఉపనయనములు కాకపోయి నను శుభకార్యములలో నాలుగు జందెపుపోచలు వేయించి

పెద్దవారితోపాటు సంభావన లిప్పించేవాడనా. వాడిపేరు పేరడు అయినప్పటికి దాతలయొద్ద పేరిశాస్త్రిలుగారని సంబోధించెడివాడనా. మనలోమాట! మనలోనున్న లోపములను మనము కప్పిపుచ్చుకొనవలెను గాని లేనియెడల ఒక్క దినమైన మనగలమా?

అప్పు:—నిజమే!

రామా:—మాటలసందడిన మరచిపోయినాను. అయితే అప్పంబొట్లు! ఈమధ్య యెక్కడా కనుబడడమే లేదు?

అప్పం:—ఏదో సంచారార్థముగా బోయినాను.

రామా:—ఏమిటా సంచారము.

అప్పం:—ఆఁ యేమున్నది. రామావధాన్లుగారు! యిది సత్యానికి మాత్రము కాలముగాదండి. నిజమాడువారికన్నీ కష్టాలే మొన్న మన సుబ్బావధాన్లు యజ్ఞానికని పదివందలరూపాయల గొట్టుకొనివచ్చి భార్యకు నాను వడ్రాణము చేయించిపెట్టినమీాదట నాభార్య పోరుబడలేక జీర్ణాలయోద్ధరణార్థమనిపోతె నూరు రూపాయలు వచ్చేవరకు పెటపెటలైనది.

రామా:—అయితే నీవును అసత్యవాదులలో వాడవే.

అప్పం:—నేను వారివలె హీనముగా జేసేవాడనా! కొంచెమేగదా యని నాగరానికే సరిపెట్టితినిగాని పెద్దమొత్తమే దొరికిన నూతనాలయమే కట్టించకపోదునా!

రామా:—అప్పంభొట్లు! అప్పటికి కాసులదండ తరుగుబడకపోయిందా!

అప్పు:—అవునండి. యజ్ఞాలని ఆలయములని చెరువులని ప్రజల కన్నులలో దుమ్ముగొట్టి యెంతెంత సంపాదించుకొనుచున్నారు?

రామా:-న్యాయమయినామనకు కాకపోయిన నిశ్చయముండకపోవదెల్లా సరదా పుంచుకోవలెగా!

అప్పం:-మొకవంటి మగవారి మాటేమిటి. స్త్రీలుగూడా యీ విద్యే మొదలుపెట్టినారని తెలిసేగదా!

రామా:-ఎదీ స్త్రీలలో లేరే!

అప్పం:-అదేమో యింతేనా! నిన్న యిద్దరు స్త్రీలు సంగీత శాస్త్రములో తమ్ము నెవ్వరు మించరట. వారిగానములకు పెద్దపెద్ద సంస్థానాలే కావలెనట. మన పట్నానికి వచ్చి దిగినారు.

రామా:-అట్లాగా !

అప్పం:-ముందుగాసామాన్యుల దగ్గరకుపోతే తరువాత పెద్దవారి దగ్గిర యెక్కువ ఉపయోగము రాదనేమో వారికి రాజాస్థానమే కావలెనని యెవ్వరడిగినా మాట్లాడకుండా ఎంతగొప్పవారైనా జూప కుండా అట్టె కూరుచున్నారు.

రామా:-పోనీ అక్కడికే పోకపోయినారేమి?

అప్పం:-సరేలే! చావు సమయములో సానులసంగీతమూనా? వారు వీరిగానానికే తొందరపడుతున్నారు. వారికి గలిగిన యిబ్బం దులతో మునగానాం తేలానాం.

రామా:-అడిగినకొద్దీ పెద్దగాథలోనికి దింపుచున్నావు! రాజుగారి కేమి యిబ్బంది.

అప్పం:-కాశీకిపోయి వచ్చెదనని చెప్పిన మాసము గడువుదాటిపోయి నను ప్రభాకరుడింకను రాకుండుటచే రజనీచరుడు నిత్యము చేయుచున్నగోల యింతింతని చెప్ప వీలులేదట.

రామా:-లాటరాజెంత దుర్మార్గుడోయి! దేశాలు తెగించిపోయిన వాడు రాకపోతే తన పుట్టిమి మునిగిపోయింది?

అప్పం:—తన మిత్రుడగు ప్రభాకరుడసత్యవాది యగునేమోయని ఒకవంక—వచ్చినచో మరణశిక్ష చెప్పవలసి వచ్చునేయని ఒకవంక —రజనీచరుని పోరుపడలేక ఒకవంక—రామ! రామ! రామావధాన్లుగారు! మహారాజునకు కలుగుచున్న మానసికాందోళన—యేమిచెప్పవలె?

వీటితో నలుగుచున్న రాజుగారిముందర యీగాయనుల తెయితెక్కలా? యాచకత్వమైనా దాతయొక్క మంచి చెడ్డ లాలోచించవద్దండి?

రామా:—అంతటి వివేకము మనకుమాత్రముండి యేడిచినది?

అప్పం:—మనసంగతి అటుండటనీయండి. ఇతరుల విషయము చెప్పుచున్నాను. సామాన్యముగ చెప్పుటకు, స్వయముగ ఆచరణమున బెట్టుటకు సంబంధమేమిటి?

రామా:—(నవ్వుచు) ఆహాహా! బాగుగా చెప్పితివి.

అప్పం:—ఈ దినమున రాజసభలో ఏమగునో పోయిచూతము. వచ్చెదరా?

రామా:—భోజనప్రియులకు రాజులగొడవ లెందుకోయి! అయినను నీమాట తీసివేయుటెందులకు. పోదముపద.

(ఇద్దరు నిష్క్రమింతురు.)



ద్వితీయ రంగము:—ఉజ్జయిని. ఆస్థానము.

[ ప్రవేశము: విక్రమార్క— రజనీచర కాశ్యపచంద్రకేతులు. ]

విక్ర:— ఐనను మానవజన్మమెత్తినందులకు ధర్మాధర్మపరిశీలనాజ్ఞాన ముండవలదా ?

రజ:— అగును. పరిశీలకుఁడగుటచేతనే కదా ప్రభాకరుఁడు

మ॥ ఇదె నేవచ్చెద నొక్కమాసమునకం । చేగెన్ గదా యీసభా
సదులెల్లన్ విని సంతసిల్లునటులన్ । సత్యోక్తులన్ బల్కుచున్
మదిలో నిల్పిన వానినేమయిన నా । మందాత్ముఁ డింకేలఁ జూ
చెదు! మాఱుల్ బచరించిపోవుటయె నం । చెన్ గాక భూమీశ్వరా!

కాశ్య:— రజనీచరా ! పోయినది పుణ్యతీర్థసందర్శనమున కగుటం జేసి యాయాక్షేత్రమ్ములం గ్రుమ్మరుచు నేదేని కారణంబున వచ్చుటకించుక యాలసించినంత మాత్రమునకై యాతఁ డసత్యవాదియని వక్కాణింప వచ్చునా ?

రజ:— ఏమి ? ఈధర్మపన్నము! ఇష్టము వచ్చినట్లు సంచరించుట కిది రాజసన్నిధిని జేసిన ప్రతిజ్ఞయా మరియొకటియా ?

చం॥ కుటిలత తీర్థయాత్రలని । కొంగుచుఁ గాశికినేగి యొంటిమై
నెటులను శిక్షతప్పికొన । నెంచి విదేశములందుఁ జేరఁగా
కిటుకిఁక వాఁడు వచ్చునను । టెంతయు వ్యర్థపు మాటలేయగున్
దటుకున వానిజాడఁ గని । దండ్యునిఁ జేయఁగ నవ్వ రింకిటన్॥

కాశ్య:— రాటరాజా ! యుక్తాయుక్త వివేకశూన్యుండవై ప్రేలినంత నేమిలాభము ? మానవజన్మమెత్తినందుల [illegible]కేని "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయంబు ననుసరించి క్రూరమృగప్రాయుండుగాక భూతదయాళుత్వపరుండు గానలదా ? సందర్భానుసారంబుగ వెడలిన వాక్యంబుల వాదంబులుఁగ నెంచి

ఘోరప్రతిజ్ఞ కొనర్చి ప్రాణంబులనైన విడుచుటకు దీసికొని సత్య
శీలుండగు నాప్రభుకుమారుని రక్తపాతమునకు సమకట్టుట గాంచుట
కిష్టగింపక నీహృదయ మెంత పాషాణసదృశమో చెప్ప నలవి
గాకున్నయది.

చంద్ర:- కాత్యాయనా! ఈతఁడే యాడెనన్న నప్పుడేమందువు?

కాత్యా:- కులాంగనల పాతివ్రత్యభంగమునకై కడంగు మహాపాతకమే
యీతని రూపడంచెనని యందును.

రజ:- నిజము.

ఉ॥ అనితర ధర్మాడంబరము గాని ♠ యాడుట కిద్దియా గాగనోవు; నా
తని సుగుణప్రకాండము లొ ♠ ధర్మమె లోకముఖంబు నెప్పుడై
నను గడుధర్మమార్గముగ ♦ న్యాయయుతంబగు ధర్మమార్గమే
ఘనమగు పాపకృత్యముగ ♦ గన్పడు నెంతటి బుద్ధిశాలికిన్॥

విశ్వ:- ధర్మమన్న నెచ్చట నిర్వర్తింపవలెనో విచారించ వలదా?

ఉ॥ కవగా నెంతటి ధర్మమైన నిలలో ♦ కాలాతిరేకంబునన్
దనువున్ వీడగ నున్నవాని రొదలన్ ♦ దాక్షిణ్యమున్ జూపు నా
తని విఖ్యాతికి సాటికాదనుచు ♠ బెద్దల్ సెప్పగా నుంటయున్
వినవే? మానుషరక్త పాతకమునకై ♦ పీక్షింపగాఁ గాదియే?

చంద్ర:- మాటలేందాగి! ప్రభాకర మహాపాతకముచే సల్లాడురు కాని
నిజమున కాతడు, మాత్రమందరివలె నూరకున్న యీతని తల
కొట్టుటకు బాల్పడవలసి వచ్చునా? ముందు వెనుక లాలోచింపక
తానాడినదే మాటయని పంతంబులు పల్కి సందులకుఁ దగిన
శిక్ష నమలుపరింపకుండుట న్యాయమునకు వ్యతిరేకములైనఁ
దలయొగ్గి ప్రతిజ్ఞాపూర్తిఁ గావించుకొని శిక్షింపబూనుట
యన్యాయమునా?

రజ:- అన్యాయమో! న్యాయమో యడుగుదురల్లో న్యాయస్థానమున నాడిన మాటల ప్రకార మాతఁడు శిక్షాపాత్రుఁడు కాక తప్పదు.

చంద్ర:- ఇంకను నాతఁడు వచ్చునని యేనా నీయాశయము?

రజ:- రాకపోనిమ్ము. అయిననేమి? విశ్రుతమూర్త్యమహీపాలా!

శా॥ తీర్థంబుల్ గనఁగోరు నాతనికి నై ♦ తెంపొప్ప నీకాశ్యపూ
దర్థిన్ బల్కఁడె మీరలెల్ల వినగా ♦ నాతండు రాకున్నచో
మూర్ధంబిచ్చెద నంచు నాటిసభలో ♦ ముంజాచుఁ దానొక్కఁడే
వ్యర్థాలాపములన్ బనేమి? యితఁడే ♦ యాలోకమున్ దీర్చెదున్

కావున,

కం॥ ఇలపై సత్యోల్లంఘన
కలుషవిదూరుఁడనుఖ్యాతి ♦ గాంచెద వేనిన్
తలవరుని బిలచి యీభూ
తలవరు మస్తకము ద్రెంపు ♦ తక్షణ మధిపా!

కాశ్య:- నేనై మున్ముందుగ నన్నెటుపోయి యెటువచ్చునోయని మిన్నకుంటి. — నీకోరిక ప్రకార మాచరించుటకిదే సిద్ధముగనున్నవాఁడ. మరియు సూక్ష్మదృష్టి నాలోచింప

సీ॥ మలమూత్రములఁగ్రప ♦ మాయల పెనుదుంప
పాపపుంజమ్ములు ♦ పాదుకొంప
గాలినిండినతిత్తి ♦ కాలునిపాళవత్తి
అనయంబుఁ బ్రకృతిని ♦ నాడువత్తి
పెనురోగముల గుట్ట ♦ పేరాశలకుఁ దిట్ట
పరుషభాషణముల ♦ పంటమొట్ట

ఉ. అన్యాయములకొట్టు ♦ నాపదలకుమెట్టు
ననృతంబులకునెల్ల ♦ నాటపట్టు
నైన యీపాడుదేహంబు ♦ బూని యొక్క
పుణ్యతముఁడైన పురుషుని ♦ బ్రోచుకొరకు
నర్పణము సేయుకంటెను ♦ నరసిచూడ
నధికతరమగు పుణ్యమీ ♦ యవనిఁగలదె?

విక్ర:—మేలు! కాశ్యపా! మేలు! పరోపకారార్థ మిదంశరీర మ్మను నార్యోక్తిననుసరించి మాటపట్టింపునకై ప్రాణమిత్తునన్న ప్రభాకరునికన్న నాతనికై ప్రాణంబులర్పింతునన్న నీవు వేయిమడుఁగులు మిన్నవైతివి. దురభిలాషులగు వీరన్నంతమాత్రమున నే యాతఁడు రాఁడని నీవును నమ్మఁదగునా? మార్గమధ్యంబున ననివార్యంబగు నేదేనాపద సంభవించుటంజేసి కాని

కం॥ జ్వలనుఁడు శీతలమొందిన
జలనిధు లింకినను నభము ♦ క్ష్మాస్థలిఁ బడినన్
జలజాప్తవిధులు గతులన్
దొలగిన సత్యంబతండు ♦ దొలగునె చెపుమా!

(భటుఁడు ప్రవేశించి)

జయము జయము మహారాజ! తమదర్శనార్థమై ప్రభాకర నృపాలుఁడు హజారముకడ వేచియున్నవాఁడు.

విక్ర:— ఆహా! సందియమేల? శీఘ్రమ తోడ్కొనిరమ్ము.

భటు:— చిత్తము (నిష్క్రమించును)

విక్ర:— సభాసదులారా! చూచితిరా! ప్రభాకరుని సత్యవాక్యపరిపాలనము!

(ప్రవేశము ప్రభాకరుఁడు)

ప్రభా:— సార్వభౌమున కభివందనము.

విక్ర:— (యెదురేగి) నృపపుంగవునకు స్వాగతము. ఈయాసన మలంకరింపుము. భవదాగమనంబు

కం॥ సాంద్రయశోయుత! ముదమున
సంద్రంబున ముంచెమమ్ము ♦ సత్యంబున ని
స్తంద్రమతుండైన హరి
శ్చంద్రమహీపతికి నీవె ♦ సాటి ధరిత్రిన్.

ప్రభా:— ఇందు భూషణ మేల?

ఉ॥ ఎన్ని దినంబులుండినను ♦ యెంతగ బ్రోదిన మంటిలోనికే
మిన్నక చేరు దేహమును ♦ మిక్కిలినమ్ముచు దుష్టకృత్యముల్
గ్రన్నన జేయుచున్ దిరుగు ♦ కర్ములు లెన్నటికేని మోహమున్
సన్నుతికెక్కఁ గాంచెదరె ♦ సత్యము కన్నను మేలిమున్న దే?

కాశ్య:— మిత్రమా! సమయంబునకు వచ్చుట కాలసించిన నిన్న సత్యాలాపివని తూలనాడిన వీరికకాలమృత్యువువలె సన్నిహితుండవగుటకు సంతసించితి.

విక్ర:— సత్యాలాపియని సంతసించినను ఆసన్నమృత్యువు నకడల వలదా?

ప్రభా:— భూపాలా!

గీ॥ చావుపుట్టుక లోకవింత ♦ కావు తెలియ
పుట్టువొందిన దేహికి ♦ గిట్టుటెట్లు
దప్పిపోవున కానల ♦ దాగికొన్న
నింతయెరిగియు దుఃఖంప ♦ నేలఁ జెపుము॥

విక్ర:- సత్యవాక్యధురా! ప్రజ్ఞాకరా!

గీ॥ ఎరుక లేకుండ వచ్చెడు • నెంతలేసి
కష్టములకైన నోర్వంగ • గలఁడు గాని
మొరిగి ముల్లైనఁ ద్రొక్కంగ • నోరుచుఁ గాదె
అధిప! యెంతటి ధీరాత్ముఁ • డైన నరుఁడు॥

ప్రభా:- కష్టసుఖంబులు మాత్రము

కం॥ రమ్మన్న వచ్చుటయు మరిఁ
బొమ్మన్నను బోవుటయును • పొసగున యెందుఁ
సమ్మతిని పూర్వభవక
ర్మమ్ములె తరిఁ గట్టికుడుపు • మానులకైనన్॥

చంద్ర:- (తనలో) విక్రమార్కుఁడీతని మెట్టవేదాంతముల మేను మరచి శిక్ష తప్పించునా యేమి?

రజ:- ఈ నిరర్థక ప్రలాపంబుల కేమిగాని ముందు శిక్షాకాలమును నిర్ణయింపుఁడు.

కాశ్య:- పరప్రాణహరణ కుతూహలాభినవ రజనీచరా! రజనీచరా! వేగిరపడి పాపచిత్తుండవని యనిపించు కొనుటయేకాని కాను న్నది కాకమానునా?

విక్ర:- మహీపాలా! న్యాయస్థానంబున గూర్చుండియు మానవ హింసకుఁ బాల్పడనేరక ప్రార్థించెద. దయామయులగు దుష్యంతధర్మజాదుల యుత్తమవంశంబున జన్మించితివి. సర్వవిద్యల నభ్యసించితివి. నీ వెరుంగని ధర్మాధర్మములు, న్యాయాన్యాయంబులు లేవు. ప్రపంచమున సహింపంజాలు పుణ్యమును హింసనొనరించిన పాపంబును లేదు. కోటిజన్మంబులైన నొక

ప్రాణసంరక్షణంబునకు సరిపోలవని పెద్దలందురు. జీవహింస కోర్వక యేమహర్షుల వంటివారు సూక్ష్మజంతుసంయుతంబులని పానీయంబుల సైతము మాని వాయుభక్షణమాత్రు లగుచున్న వారు. అట్టి చలిచీమలనైన ద్రొక్కుటకు సంకటపడు మహా మునులచే రచియింపఁబడిన శాస్త్రంబుల నామమాత్ర మరసిన నీవు పవిత్ర కులీనుండ వగునీవు మాటలెట్టింపులలో బుట్టిన నోడుబాటును పాటిగా దీసికొని యింతటి యమానుషకృత్యం బునకు సమకట్టుట పాడికాదు. ఇతండైనను, శాంత చిత్తుండు. సత్యధురీణుండు. నిర్మలచరితుండు.

క॥ నరవర ! యీదృశ సుగుణా
కరుని ప్రభాకరుని వేగ ♦ గావుము కరుణా
పరికించి మున్నహింసా
పరమోధర్మః బటంచు ♦ బలుకర్ వినవే?

రజ:—

శా॥ ఓహోహో! యివియేటి మాటలగునో ♦ యుర్వీశ యీతండు నీ
స్నేహం బెప్పుడు బాయఁడంచు మదిలో ♦ జింతించి శిక్షింపకే
సాహంకారుని వీనిఁ బోవిడుచుటల్ ♦ జానా? నె? ధర్మంబెదో
యూహల్ గాంచుచు పక్షమాదకిచుతీ♦ర్పొప్పర్ మహీంభర్తకుల్

చ॥ నెలతుల పొలి నమ్మికను ♦ నేనయి నిట్టుల నాడి యోడినన్
బలుకఁ గలారె యీగతి ప్ర ♦ భాకరుఁ డీరును? వేయి నేటికిన్
బలికిన రీతిగా నగడి ♦ పాడిని దీర్పుఁడు, కాక లెక్కనన్
దొలఁత నకీర్తియున్ బిదప ♦ దుర్గతియున్ సమకూరు భూవరా!

ప్రభా:—దయామయస్వరూపా! విక్రమభూపా! ఒక్క మిత్రుని నీచ జీవంబులకై మీరింత వనటంబొందఁ దగదు. ప్రతిజ్ఞాపరిపాలన మా సత్యము నాశ్రయించి యుండు. కావున సర్వజనులకుసత్య

ధర్మవ్రతము గాంచినట్టి [illegible] ధర్మప్రబోధ
[illegible] నోర్వలేక [illegible]

కావున [illegible] విశ్వేశ్వర [illegible] రసాస్వాదనుండనై యాశాపాశమ్ముల జ్ఞానాసిం గోసి యీషణాత్రయం బులం బాసి యక్షయానందదాయక పరమపదారోహణంబుం గోరు నాకు శపథపూరణకృత నిశ్రేణి నాధారంబుగాఁ జేయుము. నాయీ కర్మదేహ విసర్జనంబునకు సుముహూర్తము నిశ్చయింపుము.

విశ్ర:—ఆహా! నేటితో ధర్మవృక్షము మొదలంట నరకబడుచున్నది. సత్యమధోగతమై పడిపోవుచున్నది. పుణ్యపుంజములు భస్మీభూతమగుచున్నది. ఇట్టియహంభావశూన్యుని వేదాంతవేద్యుని నిర్మలమానసుని వేయేండ్లు తపంబొనర్చినను పరమేష్ఠి భూలోకంబునకు భూషణంబుగా నొసగఁగల్గునా? ఇటువంటి సద్గుణరాశి గతించిన మధ్యమలోకంబునకు గతియేమి? ధర్మంబున కాశ్రయమేది? సత్యమున కునికిపట్టెక్కడ?

ప్రభా:—మిత్రమా! నావంటి హీనమానవుఁడొక్కండు పోయిన నేమి కొరంత? ఈజగద్ధాత్రి సుగుణనిలయులు పుణ్యాత్ములగు కుమారుల ననేకుల గాంచియున్నది.

కాశ్య:—రజనీచరునివంటి దురభిమాను లెందరైన నుండురుగాని నీవంటి సుగుణఖనియొక్కరుండుండుట దుర్లభముగదా!

రజ:—అగును. మానసం బెట్లున్నను మాటలతేటలు జూపువారు త్యాగశీలురుగను హృదయమును దాపక నిర్భయముగ మాటలాడువారు దురభిమానులుగను మీవంటివారికి గోచరించుట యొక వింతగాదు.

విశ్ర:—[illegible] నీవాదము [illegible] గట్టుగఁజేసి విచారింప వలసివచ్చె. ఇంతటి [illegible] గర్త

నీవగుటం జేసి పుణ్యపాకంబులు నీయందనునిచి యీఘోర కృత్యంబునకు ముహూర్తము రేపు నిశ్చయించితి. ఆహా! నీసాంగత్యమునఁ జేసి నేటి కొక్క నీతి నెరింగితి.

గీ॥ పాపజన సంగతినిఁ జేసి ♦ పాపు లగుదు
రనుచుఁ బెద్దలు వచియించు ♦ టాదరము లె
యయ్యొ నీపట్ల గడుఘోర ♦ మైనయట్టి
కార్యమున కేను తలయొగ్గు ♦ కారణమున॥

చంద్ర:- (నవ్వి) పుణ్యజనుఁడగు ప్రభాకరుఁడు గూడ నుండెఁగదా! సత్కార్యమే రాగూడదా?

(కెరలో)

ఆహా! రావచ్చును. మహారాజుగారి యాజ్ఞయగువరకు కొంచెమోపికఁబట్టుఁడు.

కాశ్య:—ఏమి యీసుశ్రుతి!

[ సేవకుఁడు ప్రవేశించి ]

జయము జయము మహారాజ! ఎవ్వరో యిద్దరు స్త్రీలు తమ దర్శనమునకు వేగిరపడుచు హాజారముకడ వేచియున్నారు.

విక్ర:—అబలలా! త్వరపడు చుండిరా? అభ్యంతరమేల? శీఘ్రమున ప్రవేశపెట్టుము.

సేవ:- చిత్తము.

(నిష్క్రమించును.)

[ ప్రవేశము: చంద్రవదనా కమలాననలు. ]

చంద్ర & కమ:—దిగంతవిక్రాంత కీర్తియశోవిశాల విక్రమభూపాలా! జోహారు.

విక్ర:—మనోభీష్టంబులు నెరవేరుగాక! అంగనలారా! ఆయాసనముల నలంకరింపుడు.

సరో:—(తనలో) చిరకాలోపవాసముచే శుష్కించిన నయనచకోరములారా! ఇంక నాథుని ముఖలావణ్యచంద్రికల దనివితీర గ్రోలుడు.

గజ:—(తనలో)పానకములోనిపుల్లలవలె వీరునుఇప్పుడేలడ్డుపడవలెనా!

విక్ర:—(తనలో) స్ఫురద్రూపిణులు. ఉత్తమకుల సంజాతలనుటకు సంశయమేమి? ఆగమనము మాత్రము చింత్యము. విశదమయ్యెడు గాక (ప్రకాశము) మానవతీమణులారా! ఆటంకములేనిచో మీకులనామాదు లెరుంగ గోరెద. మరియు

కం॥ చారుశిరీషసుమంబుల

గేరెడు మీవైన యడుగు • కెందామరలన్

గ్రూరత నారడి వెట్టగ

గారణమా బెట్టిదంపు • కార్యము సెపుడా!

చంద్రవ:—సార్వభౌమ! ప్రస్తుత కార్యమును బట్టి మాకులస్థలములతో నంతగా పనియుండదని విన్నవింప వలసివచ్చినందులకు క్షమింప వేడుచున్నారము. నాపేరు చంద్రవదన యందురు. ఆమె పేరు కమలానన. మేము గాయనులము. మేమిరువుర మొక్కచోట బుట్టిపెరిగి మైత్రితో మెలంగుచు సంగీతవిద్యయందొక్కింత పరిశ్రమ చేసితిమి. కాన దానిచే నిప్పు డసూయలు పెరిగి గానంబున నాతో సరిపోలవని నేనును వాతో సాటిగా జాలవనియామెయు వివాదపడి నిర్ణయించుకొనుటకు అనేక రాజసభలకుంబోయి విఫలప్రయత్నలమై తుదకు జగన్నుత చారిత్రుండును సంగీతకళా రహస్యజ్ఞుండునగు మీయాస్థానముఁ జేరితిమి.

ప్రభా:—(తనలో) ఈమె చందముచూడ మున్నెన్నడో విన్న కంఠస్వరము వలెనున్నది. ఎవ్వతెయై యుండనోపు.

విక్ర:—చంద్రవదనా! నీవన్నట్లు గానకళయందంత ప్రవేశ మున్నవాఁడనుగాను. గంధర్వకాంతలం బోలెనున్న మీవివాద మేనారదతుంబురులవంటివారో తీర్పగలరుగాని నావంటివానికి సాధ్యమా ?

కాశ్య:—సార్వభౌమా! ధర్మనిర్ణయస్వరూపులగు తమరే యిట్లన్న వారివాదంబుల తీర్పుటకు దిక్కెవ్వరు ?

విక్ర:—నాహృదయమిప్పుడు భగ్నమై పోయినది. కర్ణగంధ్రములు స్వాధీనము తప్పినవి. ఇప్పటి స్థితిలో దీని నిర్ణయింపజాల.

చంద్రవ:— ప్రభూ! తప్పక తమకడనే నిర్ణయించుకొన వలెనని గంపెడాసతో వచ్చిన మమ్ము విఫలమనోరథలం జేసిన మాకింక గతియేమి? ఎట్లులైన రేపువఱపనక దీనినిప్పుడే తీర్పకున్న మీపాదసన్నిధి ప్రాణంబుల——

విక్ర:— వలదు వలదు! అట్లైనట్టికిం జరుగకుండు గాక! ఇప్పటి భయంకరమానవ ప్రళయంబున వర్ధోలోకంబునకు తలక్రిందై పడబోవు నేనట్లంటిగాని మరొండుగాదు. ఐనను సభాసదుల సహాయముచే సాధ్యమైనంతవరకు ధర్మనిర్ణయము చేయఁబడును కావున మీగానంబుల నుపక్రమింపుఁడు.

చంద్రవ:—ద్విపద

ప్రకటాను రాగసం ♦ భరితభావమున।

మకరందరసపాన ♦ మత్తతఁదేలి।

ప్రమదాతిరేకైక ♦ పారవశ్యమున।

రమణీయ ఝుంకార ♦ రావంబొనరి।

క్రూరదోషాకర ♦ కారణంబునను
కారుణ్యమునువీడి ♦ కఠినుండవగుచు ।
సమయసంబోధిత ♦ స్వాంతుండవగుచు ।
భ్రమరమా! పద్మినీ ♦ బాయంగఁదగునె?

రాజ:— ద్విపద

అప్రేమవాహిని ♦ యడుగంటెనోకో ।
అప్రమోదస్వాంత ♦ మవసిల్లెనోకో ।
మేనురఝుంకార ♦ మిషమునఁదన్ను ।
సాదరంబుగ వేగ ♦ సాఁకకయున్న ।
మోదంబులేకప్డు ♦ ముకుళింపకున్న?
అమలాత్ముఁడగు మిత్రు ♦ నక్కటికమున ।
భ్రమరమా! పద్మినీ ♦ బాలింపకున్న ।
సమయుటకిసుమంత ♦ సందియమున్న?

ప్రభా:— (తనలో) అయినను వారిటకేల వత్తురు? మొగమును బోలిన మొగమును కంఠమును బోలిన కంఠమునుండఁ గూడదా?

రజ:— గాంధర్వ కల్పవల్లు లవని కవతరించినవి.

కాశ్య:— ఏమి! స్వరమాధుర్యము!

చంద్ర:— శెబాస్. తంత్రీమేళము!

విక్ర:— గాయనులారా! రాలను గరగించుచు ప్రమోదులఁ జిగిర్పజేయు మీగానంబులు లోకమోహనంబులు. స్వరవైకల్యంబుతప్ప మీ యిరువురియందు భేదం బిసుమంతయుం గన్పట్టదు. మీ రింక వాదంబుల నుపసంహరింపుఁడు.

చంద్రవ:—దేవరవారి యాజ్ఞానుసారమట్లే యొనర్చెదము.

ప్రభా:- మేలుమేలు! గానకౌశలంబునకుఁ దోడుగానున్న మీ వివేక సంపద యత్యంత శ్లాఘనీయము.

విక్ర:-అంగనలారా! ఏదైన బహుమానంబు నొసంగెద. కోరుకొనుఁడు.

చంద్ర:- ఇప్పుడు నన్నుఁ గోరుకొనకుండుట సంభావ్యము కాదు కావున కోరుచున్నాను. విక్రమభూపాలా! సభాస్తారులారా! ఆడుదాని మాటలని యనాదరణంబు సేయకుఁడు. న్యాయంబున దృష్టుల నిడిమానసంబు ఏకాగ్రంబుగ నిల్పి నేఁజెప్పఁబోవు వాక్యంబు లాకర్ణించి యెట్టులైన నన్నుద్ధరింపుఁడు.

చంద్రకే:- (తనలో) ఉపోద్ఘాతమే యింతయున్నది. కోరిక యింకెంత యగునో!

ప్రభా:-(తనలో) ఏదియో గొప్ప విషయ ముండుటం బట్టియే సభికులను మున్ముందు వాక్యబద్ధులఁ జేయుచున్నది.

విక్ర:-తరుణీమణీ! సంశయమేల? నిర్భయంబుగఁ గోరికొనుము.

చంద్రవ:-స్వామీ! మీపరిషన్మధ్యంబున నారీజనసమ్మోహాకర సౌందర్యంబును రశికశిఖామణియు నగు నొక్క నరేంద్రుఁ డున్నవాఁడు. ఆతండు నన్ను రహస్యంబుగ వివాహమాడి కొంత కాలంబిష్టసుఖంబులదేలి యిప్పుడు విడనాడి నన్ననాథం జేయ నెంచి యెటకేని నరిగి నేఁడిటఁ గాన్పించు చున్నాఁడు. కావున మీరెట్లయిన నాతని నాకొప్పింపుఁడని కోరుచున్నదాన.

చంద్రకే:-(తనలో) ఆపాపి యెవ్వండో కదా !

కాశ్య:-(తనలో) ఈపాపము నాతలమీదఁ బడదుగదా!

రజ:- (తనలో) ఇది మహా కులటగాఁ గన్పించుచున్నది.

విక్ర:- (తనలో) ఏమిది ఈదినము దుఃఖమయం బనుకొన్న మధ్య నాశ్చర్యానంద ప్రదర్శకంబు గల్గినదే! (ప్రకాశముగా) చెలియ నిన్నింత ప్రేమింపఁజేసి తుదకు నడవిపాల్సేసి పోయిన నరుండెవ్వఁడో దెల్పుము. నిక్కముగ నింక నీవాఁడు కాగలఁడు.

చంద్రవ:-ఎవ్వఁడో యని విచారింపనేల? తగుదునని మీపరిగ్రహణం గూర్చుండి యున్న దురభిమాని రజనీచరుండే.

రజ:-(సంభ్రమముతో) ఆఁ ఏమిది?

విక్ర:-ఏమేమి! రజనీచరుఁడా!

చంద్రవ:-అగును

విక్ర:-ఏమిది రజనీచరా!

రజ:-అసత్యము రాజేంద్రా! సర్వజ్ఞులగు మీరింత మాత్రమునకు నమ్మిక జూపఁదగదు. లోకంబునఁ దరుణులు సుందరపురుషుల గన్నంత మోహపరవశంబున నైమరచుటయుఁగలదు. కావున నొక్కింత శీతలోదకము చే—

చంద్రవ:-రజనిచరా! కృతఘ్నుండవు కాకుము. నారాజ్యంబున కింతయు నిన్నధీశ్వరుం జేతునని వలపుసొలపుల నన్నింటి చూపితివి? ఒక్కమారు సింహావలోకనంబు చేసి కనుగొనుము. పోనిమ్ము వానితోపాటు నన్ను మరచినను మన వివాహమాది నాకడ నుంచు నిమ్మెనైన మఱువవు గదా!

రజ: ఛీ! అసత్యాలాపినీ! సత్యనిష్ఠాగరిష్ఠులగు మహాపురుషులున్న నిండుసభలో ననృతంబులను నృతంబులుగ జూపి నీపాంసులతా భావంబును వెలిబుచ్చుటయేకాక సాధ్వీమతల్లినాదోచు సియుబలను సైతమేలఁ జేర్చెదవు?

విక్ర:-నిజమున కాభీరువు నిన్నన్న డెరుగనిదయైన నిందరు రాజన్యులుండ నిన్నే ప్రత్యేకించి సాహసించి పలుకగలుగునా?

ప్రభా:-(తనలో) ఇదియంతయుఁ బరీకింప మాయానాటకముగానున్న యది. మరియు

గీ॥ సతులు రాజముఖిసరో ♦ జముఖు లనుచు
మాదికి స్ఫురియించు చుండిరీ ♦ మానవతులు;
చిత్రమది యేమొ మనమున ♦ జేయి వెట్టి
కలచు చున్నది నేనింక ♦ నిలువఁజాల ॥

(ప్రకాశముగా) మానవేంద్రా! దేహ మస్వస్థతగా నున్నయది. కొంచెముసేపు—

కమ:—(తనలో) అకటా! నాధుని మానసవ్యధ చూడలేకున్నదాన.

విక్ర:—అయ్యో! మిత్రమా! అదియేల?

ప్రభా:—చెప్పుటకేమియుఁ దోపకున్నది. ప్రకృతము శెలవొసఁగవేఁడెద.

విక్ర:—కొంచెమోపిక బట్టుము. సీరివివాదము తేలినపిదప—

రిజ:—మహారాజా! ఇందుఁ దేలవలసిన యంశ మేమున్నయది? సత్యంబునాశ్రయించి పలుకుచున్నాఁడ. వీరల నిరువుర స్వప్నమందైనఁ జూచి యెరుంగ. విధియైన నెరుగ. పరమేశ్వర సాక్షిగా నేనుడువునది సత్యము. సత్యము.

చంద్రవ:—సభాసదులారా! వింటిరా సత్యాలాపి నిర్భయవచనంబులు! కలనైన మమ్ముల నెరుగఁడట! ఈవాక్యములు మీహృదయముల బదిలపరుపుడు. మొగమోటములవీడి సత్యనిర్ణయము గావింపుఁడు. నావాక్యంబుల కాధారంబుగ నీతనిచే లిఖింపబడిన లేఖఁ దిలకింపుఁడు. (అనిలేఖనిచ్చును.)

విక్ర:—కాశ్యపా! దీనిం జదువుము.

కాశ్య:—(చదువును)

"అమాత్య శేఖరా!

నాఁడు విక్రమార్కసమక్షంబున గల్గిన విషయంబుల నెల్ల దెలియఁజేసియే యుంటిఁగదా. అట్లు విదర్భకరిగి యనేకవిధంబుల నాపె వర్తనంబుల నారసి యెందును మనోరథసిద్ధి నొందలేక, మరిగి యంతఃపురవిషయంబుల నరయుటకై కుహనాభూమికలం ధరించుట యందు నిపుణుండగు మనచారుని యోగినీ రూపంబున నంపితి. భగవదనుగ్రహంబున నాసమయముననె, బిచారికలగు కళావతీ రాణులకు అసూయావివాదంబులు ప్రబలి కళావతి పతిమాని స్వగృహంబున శిక్షించుట నతనిచే విని యాపె ధనలోభుఁగాఁ జేసి మరల నంతఃపురంబున కనుప నాకళావతియు భర్తృవియోగదుఃఖ జీవితయగు సరోజముఖ బిగంబుల మరచి యొకనాఁడు దేవపూజకై చనిన నగియు యాదనని స్మారకచిహ్నంబులుగా ప్రభాకరున కాపెకొసంగిన ఖడ్గాంగుళీయకంబుల పదిలంబుఁ జేసి మరల నేదియో సాకు చెప్పి యా రోగిని దెచ్చి నాకొసంగి మూడవగుర్తుగా నూరుగతలాంఛనంబు దెలుప వానిని సేకరించి సభలో వెల్లడించి ప్రజ్ఞాపూరణం బొనర్చితి. పాప మాప్రభాకరుం డీపది దినంబులైన బ్రతుకవచ్చునని కాబోలు కాశీక్షేత్రంబును దర్శించి వచ్చెదనని మాసంబు గడువడగి వెడలెను.

మరల నాతండు వచ్చెదనుక నీయువతి యిచ్చటనేయున్న నెటు వోవు యెటువచ్చునో యను సందేహముచే మనపట్టణమున కనుపుచుంటి. కావున నీకళావతిని అప్రమత్తుండవై నేను వచ్చేయునంతవరకు దగురీతి మన్నించు చుండుము.

ఇట్లు,

గజనీచరుఁడు."

రజ:- (తనలో) అకటా! నేఁటికో నాయాయు వంత మొందినది. అయినను వీరి కిదెట్లు లభించెనో.

ప్రభా:-(తనలో) ఏమిది! స్వప్నమా లేక యింద్రజాలమా?

విక్ర:-వారీరత్నమా! ఈలేఖ మీ కెట్లులభించినది?

చంద్రవ:-వారణాశికి యతిరూపమున బోయిన నాథుని సందర్శనార్థ
మతిదుఃఖభారంబులో సరోజముఖయగు నీమెయు—

ప్రభా:- హా! పరమేశ్వరా! (అని మూర్ఛిల్లును.)

శాక్య:-(పట్టుకొని మిత్రమా! మనంబొక్కింత చిక్క బట్టుము.

విక్ర:-తరువాత

రాజ:-రాజముఖనగు నేనును నరుగుచు మార్గమధ్యంబున సర్పదష్టయై
పడియున్న కళావతిం గాంచితిమి. అంతనది తన స్వామిద్రోహ
మునకుఁబశ్చాత్తాపమొందుచుఁ దచ్ఛాంతికరంబుగ నీకవ్వ
మాకొసంగి మరణించె.

విక్ర:-(తనలో) పాప మూరకఁబోవునా?

రాజ:-కాశీపట్టణంబునఁ దనకాంతునితోఁ గలసి ప్రార్థించుటకన్న
లేఖాసహాయ్యమున మీయందరి సమ్ముఖంబుననే తన పాతి
వ్రత్యగరిమ నిలుపుకొనుట మేలని యెంచి యెట్టకేలకు గాన
కళాప్రదర్శనాసైతవమున మాదేవి—

విక్ర:- రజనీచరా దీని కేమనియెదవు?

రజ:- (నేలఁజూచును)

విక్ర:- రజనీచరా! ఏమనియెదవు ?

శాక:- రాజమ్మన్యా !

చ॥ పరమపతివ్రతాత్వమున ♦ భాసిలు నీయమ సచ్చరిత్రకుఁ
గురు-మలినీకృతుండయిన ♦ క్రూరుఁడు వీఁడని సర్వకాలముఁ
వరలెడు లోకనిందలకుఁ ♦ పాత్రుఁడనైతి నటంచు బుద్ధికి
నెరపుదె శాంతి యింక రజ ♦ నీచర! పాపము పండె గావునన్.

రాజ:- సార్వభౌమా! ప్రాణసఖిగా నామనోహరమగు [illegible] శ్యయనీ ప్రాణదానం బర్థించుచున్నది.

సరో:- నాథా!

గీ॥ దుష్టమతి నాదు నేరము ♦ దోషమనది
సూతయైనను లేదు శ్రీ ♦ కాంతునాన
పంతగింపక నాయందు ♦ పరమకృపను
నరయకుండిన దిక్కెవ్వ ♦ రకట యింక

(అని పాదములపై బడును.)

విక్ర:- మానవేంద్ర ! ఇత్తరి మత్కుమారికగా నీయువతి నిచ్చుచుంటి గావున

గీ॥ పరమ పావన చరిత యీ ♦ పద్మనయన
నేలుకొనుమయ్య సతినిఁ గృ ♦ పాళుఁడవయి
అమల వైశ్వానర వితీర్ణ ♦ యైన భూమి
జాతఁ గైకొన్న శ్రీరామ ♦ చంద్రు కరణి.

కాశ్య:- మిత్రమా! ప్రభాకరా!

చ॥ పరనరనాథ సంతతికి ♦ స్వప్నములందును సూతయే నగో
చరయగు కాంతయిల్వెడలి ♦ సాహసవృత్తిఁ జరించె నంచు లో
నరయకుమయ్య పొల్లిసమ ♦ యంబున యుండును దుఃఖవేళలన్
మఱువులు కూడ దంద్రిలను ♦ మానవనాయక పూర్వపుణ్యోజ్జ్వలన్

ప్రభా:- (తనలో) హా! ఇంక భరింపఁజాల (ప్రకాశముగ) మనో నాయకీ

మ॥ సతి నీనిర్మలభక్తిభావము నిజ ♦ ప్రస్ఫూర్తి వీక్షించుచున్
మతిహీనుండగు నొక్కఁడాడు పలుకుల్ ♦ మన్నించి ఘోరాటవి

గతులఁ దుఃఖపరంపరల గుడుచుచుఁ ♦ గాసిల్లఁగా [illegible] స
ద్గతిం దప్పిన నీచునట్లు మరలఁ ♦ గైకొందు వస్త్రాసన్నా.

సరో:- నాథా! ఇంక మీఁదోష మేమున్నది?

గీ॥ పూర్వభవమున నే జేయు ♦ పుణ్యమేమి
లేకయుంటను కర్తనీ ♦ లోకకర్మ
మిట్లు దీనికి నడలిన ♦ నేమి ఫలము?
పాయునే యెట్టివారికిఁ బ్రాకృతంబు.

విక్ర:- రజనీచరా! ఇప్పుడు ప్రతివాదిత్వ నిరూపణాంబు నీయందు లేమిం జేసి నీవు శిక్షాపాత్రుండ వగుచుంటివి.

సరో:- (తనలో) హర్షపారవశ్యమున నేత్రగోళములనుండి బాష్పము లొలుకుటచే నాథుని చూడనేరకున్నాను.

రజ:- విక్రమార్క మహీపాలా!

చ॥ మనమున రాజుజేసి యతి ♦ మాన్యత నొప్ప సతీమతల్లికిఁ
ఘనమగు దూరుకట్టిన య ♦ ఘంబును బొంది జగంబులోన నిం
కను మొగమెత్తగా వెరతు ♦ గావున వేగమ శిక్షఁ గొంది యీ
తనువును వీడఁగోరెదను ♦ ధర్మమె నిల్చుత లోక మెల్లెడన్.

కాశ్య:-స్వయముగా వచ్చుదానికి యోజనమేల?

విక్ర:- ప్రభాకరా! యాతని శిక్షకు నీయాశయ మేమి?

ప్రభా:- ఈతని నికృష్టకృత్యంబులకుఁ బాల్పడిన సరోజముఖియే [illegible]

సరో:- నాథా! ఈతండు పశ్చాత్తాపంబు వెడలఁబుచ్చుచుండె గావున పాదపాలంకారులగు నృపుల కింతకంటె శిక్ష యేమున్నది?

విక్ర:- కుమారీ! సువర్ణముయు సాధ్వీ చరిత్రంబునకు వన్నె తెచ్చితివి.

ఊ:—తల్లీ సీతగుణాలయంబగు నాసుధ సేచనంబున మరణాంతంబు బాసి బ్రతుకగంటి నేయువందనము లాచరించుచున్నాఁడ.

సంద్ర:—అమ్మా! ఇందొక విశేషము కలదు. రావణాదులవంటివా రుండుట చేతనేగదా సీతాద్రౌపద్యాది సతీతిలకంబుల చరితములాచంద్రతారార్కస్థాయులై విలసిల్ల గల్గినవి. అట్లే

గీ॥ జ్ఞానహీనత నీతఁడు ♦ కాని పనుల
గొన్నిటిని చూపుకతన నే ♦ మొన్నరాని
సాధ్వీతనమునఁ దనరిన ♦ దాన నైతి
తమము లేకున్న రవికాంతి ♦ తనరు నెట్లు॥

ప్రభా:—తరుణీ!

గీ॥ నిత్యకల్యాణ దాయివై ♦ నెగడు నిన్ను
వంటి సాధ్వీవతంసంబుఁ ♦ బడయు కతన
మానవుల యందు మున్ననై ♦ మనగ గంటి
నింక నాకన్న ధన్యాత్ముఁ ♦ డెవ్వఁ డిలను॥

సగో:—నాథా!

గీ॥ ప్రాణములు పోవనున్నను ♦ మానవతుల
కాత్మగళసూత్రముల ప్రోపె ♦ యధిక కృత్య
మగుట నాయందు నట్టిద ♦ యద్యొ గాని
లేశమైనను ఘనమిందు ♦ లేదు తలప॥

మిత్ర:—నేటికి సత్యశీలురగు మానసతీపతులు విపదబ్ధుల నల్లదాటి సుఖంచుటంజేసి సంతసించితి అయినను ఇట్లగుగాక

చ॥ స్థిరముగ గాంతశెల్లను వ ♦ శిత్రవతత్తై ధరణీతలంబునన్
గరిమమెఱ గాంధ్రభూగాక సుర. ♦ కాంతలు మాతృసమాన. లంచెదర్
పురుషులు సత్యధర్మములు ♦ బ్రోచుచు నుందురుగాక భూప్రజల్
వరుకరుణానుషంగులయి ♦ పాలన చేతురుగాక భూపతుల్॥

ప్రభా:—తథాస్తు.

(అందరు నిష్క్రమింతురు.)



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| విజ్ఞప్తి | 8 | దానిని | దీనిని |
| 1 | 10 | సేతుసీత | సేతుశీత |
| 7 | 6 | పతిని | సతిని |
| 25 | 4 | సైల | శైల |
| 27 | 1 | లేరలే | లేనలే |
| 31 | 14 | మగుచు | మనుచు |
| 38 | 18 | కళా:- | కళా:- (తనలో) |
| 47 | 9 | మమునకై | మనమునకు |
| 50 | 3 | నికృష్ణ | నికృష్ట |
| 54 | 6 | రాజ:- | సరో:- |
| 61 | 1 | న | గ |
| 72 | 3 | కాంతన | కాంతుని |
| 76 | 4 | చున్నదే | చున్నది |
| 76 | 24 | లోకోపవాదం | లోకాపవాదం |
| 98 | 9 | శెలవో | సెలవో |
| 99 | 14 | ప్రజ్ఞా | ప్రతిజ్ఞా |
| 103 | 13 | మన్ననై | మిన్ననై |

